ఈ నాటకం ప్రథమంగా శ్రీ వెంకటేశ్వర మెమోరియల్ క్లబ్, రాజమండ్రివారిచే ది 15–9–56 తేదీని శ్రీ విక్రమహాలులో శ్రీ దేవత రామమోహనరావుగారు ప్రెసిడెంటు, చాంబర్ ఆఫ్ కామర్సు రాజమండ్రివారి అధ్యక్షతను ఈ క్రింది నటవర్గముతో ప్రదర్శింపబడినది.

న ట వ ర్గ ము :—

1. స్వామినాథం :— శ్రీ వై. శ్రీహరిరావు
2. జడ్జి :— శ్రీ పి. యస్. భాస్కరరావు
3. సుకుమార్ :— శ్రీ వై. శేషగిరిరావు
4. శేఖర్ :— శ్రీ వి. యస్. రావు
5. ముసలయ్య :— శ్రీ పి. లక్ష్మీపతి
6. దొంగ :— శ్రీ డి. వెంకట్రావు
7. సబ్‌యినస్పెక్టర్ :— శ్రీ కె. సత్యనారాయణ
8. విశాల :— శ్రీమతి కె. వి. శాంతాదేవి

ద్వితీయ ప్రదర్శనం—అదే హాలులో ది 11–11–56 న ప్రదర్శింపబడినది.

తృతీయ ప్రదర్శనం—అదే హాలులో ది 1–12–56 న ప్రదర్శింపబడినది.

# ముందుమాటలు

బెర్నార్డుషా నాటకాలలో ఒక నాటకం ఈ నాటకానికి మూలం. కాని కథ అంతా పోలికలేకుండా మారిపోయింది. కొన్ని పాత్రలలోనూ, అడివి పరిసరాల్లోనూ, పోలిక లీలగా కన్పిస్తుంది. అంతకుమించి మూలానికి విషకుంభాలలో ఉన్న కథకూ ఏమీ సంబంధం లేదు. ఈ నాటకం ప్రథమ పర్యాయం ప్రదర్శించిన శ్రీ వెంకటేశ్వర మెమోరియల్ క్లబ్, రాజమండ్రివారికి నా కృతజ్ఞత.

మొదట్లో ఈ కథలో సుకుమార్ పాత్రకు కొన్ని Complicated సన్నివేశాలు పెట్టాను. కాని అవ్వన్నీ అర్థం కావటం నాటక ప్రదర్శనలో అసాధ్యమని తోచి చాలావరకు తీసివేశాను. పాఠకులు గాని, ప్రేక్షకులు గాని చూడవల్సింది, సుకుమార్ అపరాధపరిశోధనా చాకచక్యంకన్నా విషకుంభాల ప్రవర్తనే గనక, సుకుమార్ పాత్రను అంత నిశితంగా చూడ నక్కరలేదు.

గంగాధరరావు.

# పాత్రలు

స్వామినాథం—ఒక భూస్వామి

సుకుమార్—స్వామినాథం కుమారుడు

శేఖర్—స్వామినాథం సేవకుడు

సాంబశివం—జిల్లాజడ్జి (స్వామినాథం దూరపు బంధువు)

ముసలయ్య—జడ్జీగారి సేవకుడు

విశాల—జడ్జీగారి కూతురు

కొత్తవాడు—ఒక దొంగ

సబ్ ఇన్స్పెక్టర్—

పోలీసులు—

రంగాలు—నాలుగు

స్థలం :—స్వామినాథం మేడలో సావడి

నాలుగు రంగాలు అంతే.

# విషకుంభాలు

## మొదటి రంగము

[ ఒక అరణ్యంలో సమీపంగానే ఒక చిన్న ఊరు. ఒక భాగ్యవంతుని మేడలో సావడి. సావడిమధ్యలో ఒక టేపాయి, దానిచుట్టూ మూడుకుర్చీలూ వుంటాయి. ఎడమవైపుగోడ ముందుభాగంలో బయటనించీ వచ్చే ఒకగుమ్మం—దానిప్రక్కనే ఒక డ్రాయరు - కుర్చీ వుంటాయి. డ్రాయరు మీద కొన్నిపుస్తకాలూ వ్రాతపరికరాలు వుంటాయి. వెనక గోడలో మరొక కిటికీవుంటుంది. కిటికీలోపల్నించి, వెనక నున్న తోట కన్పిస్తూవుంటుంది. కుడివైపు గోడ వెనక భాగంలో మేడమీదకువెళ్లే మెట్లు ముందుభాగంలో లోపలికి వెళ్ళే గుమ్మం వుంటాయి. మెట్లకిగుమ్మానికి మధ్యగా ఒకబల్ల అమర్చబడి వుంటుంది. గోడలకు కొన్నిపటాలు, కేలండర్లూ అలంకరించి వుంటాయి.

తెర లేచేసరికి స్వామినాథం (యాభై అయిదేళ్ళవాడు) పట్టుబట్టలు, మెళ్ళో రుద్రాక్షమాలలతో (శుద్ధ శ్రోత్రియుడు లాగ వేషం) టేబుల్ దగ్గరకూర్చుని ఏవో ఉత్తరాలు వ్రాస్తూ కూర్చున్నాడు. ఉత్తరాలువ్రాసి కవర్లో పెట్టి అంటించి అడ్రెస్ లువ్రాసి శేఖర్ని పిలుస్తాడు ]

స్వామి—శేఖర్ ! శేఖర్ !

శేఖ—(25 ఏళ్ళవాడు, యువకుడు బాగా బలశాలి వస్తాడు.)

స్వామి—ఇదిగో ఈకవరు తీసుకెళ్ళి మన శంకరంగారికియ్యి.

శేఖ—అల్లాగే.

స్వామి—(మరో కవరందించి అతనిచేతికిస్తూ) ఇది రామానుజంగారికియ్యి.

శేఖ—అల్లాగే.

స్వామి—ఏం అల్లాగే? – అల్లాగేనని ఇప్పుడు తలూపుతావు తరువాత వాకరికివ్వాల్సింది వాకరకిచ్చి వస్తావ్. సరిగ్గా విను – ఇది శంకరంగారికీ. ఇది యీకవరూ . . .

శేఖ—రామానుజం గారికీ?

స్వామి—ఏ రామానుజంగారికీ ?

శేఖ—ఎ. రామానుజంగారికి

స్వామి—చూశావా! ఏ రామానుజంగారికో తెలియకుండా నే అల్లాగే అనేశావ్. నేనివ్వమన్నది ఆ. ఎ. రామానుజం గారికి.

శేఖ—నేనిస్తానన్నదీ ఏ: రామానుజంగారికే.

స్వామి—ఆ! ఆ! చెప్పకపోతే వెళ్ళి, "పి. రామానుజం" గారికిచ్చేవాడివి.

శేఖ—అల్లాగే.

స్వామి—నాదగ్గర ఆవళ్ళు పొగరే పనికిరాదు. వళ్ళుపొగరు, రౌడీబుద్ధులు వదిలేశావంటేనే వుద్యోగం యిచ్చిదగ్గరుంచుకొన్నాను. తెలిసిందా,

(ఏదో చెప్పబోగా శేఖర్ మామూలుగా తలవూపేస్తూ)

శేఖ—తెలిసింది.

స్వామి—ఏం తెలిసింది - నేనింకా చెప్పకముందే!

శేఖర్—తెలిసింది. నా కంటె తక్కువ తిండి తిని ఎక్కువ పనిచేసేవాళ్లు చాలమంది దొరుకుతారు మీకు. ఇవ్వన్నీ రోజూ అనేమాటలేగా.

స్వామి—అదే...అదే...ఆ వళ్ళు పొగరే పనికిరాదు. ఏదో కుర్రాడివి...చెడిపోతున్నావని దగ్గరుంచుకున్నా కావాలంటే నీ మాత్రం వాళ్ళు నాకు......

శేఖర్—లక్షలు దొరుకుతారు.

స్వామి—ఆ. పో...అవ్వి యిచ్చిరా (బయట కారు వచ్చి ఆగిన శబ్దం విని) ఆగు. ఏదో కారువచ్చి ఆగినట్టుంది. చూడూ.

శేఖర్—(చూసి)ఆ. కారు వచ్చి ఆగింది.

స్వామి—కారువచ్చి ఆగి ఎవరో దిగిన సంగతి నేనూ విన్నాను ఎవరు దిగారో...ఎంతమందో చూడు! పో!

[శేఖర్ బయటకువెళ్ళి చూసి వస్తాడు]

శేఖర్—జిల్లా జడ్జిగారు వచ్చారు.

స్వామి—ఆ! జిల్లా జడ్జిగారా! జిల్లా జడ్జీగారా! వారిని నువ్వెట్లా ఎరుగుదువు.

శేఖర్—తెలుసు.

స్వామి—ఎందు కొచ్చారో. ఎప్పుడు బయలుదేరారో! నువ్వెళ్ళు తొందరగా ఇంట్లో చెప్పు. ఆ మేడమీాద

వెనకగది ఖాళీ చేయించు. కాఫీ తొందరగా పెట్టమను.
(శేఖర్ లోపలికి వెళ్ళాడు. స్వామినాథం ఎదురువెళ్ళి)
రండి. రండి. దయచేయండి. బహుకాల దర్శనం.

[అంటూ వుండగానే జడ్జీ సాంబశివంగారూ ఆయన కుమార్తె విశాల వస్తారు]

స్వామి—అల్లా కూర్చోండి. ఇల్లాకూర్చోఅమ్మా! (అందరూ కూర్చుంటారు)

స్వామి—ఆ. క్షేమమా? సరాసరి కారులోనే వచ్చేశారా?

[వారితో ఒక జవాను సామానంతా లోపలికి పట్టుకొస్తాడు రెండుమూడుసార్లుగా— దాన్లో రెండు రెండు పెట్టెలూ బుట్టలూ ఉన్నాయి]

జడ్జి—ఆ; కారులోనే వచ్చాం.

శేఖర్—(వచ్చి) కాఫీ పెట్టమన్నారా?

స్వామి—ఇంకా కాఫీ పెట్టమన్నారా? అంటూనే వున్నావ్? పెట్టమను.

శేఖర్—మరి కాగితాలవ్వీ యిచ్చిరమ్మన్నారూ?

స్వామి—ఆ! ఆ! ఇచ్చిరా! అహా...రామనాథం లేడు కాబోలు! సరే ఉత్తరాలు తర్వాత యివ్వొచ్చులే. ముందు కాఫీ పెట్టి తీసుకురా (శేఖరు వెళతాడు) నే నివ్వాళ శనివారం లెండి వంటవాడు రాలేదు కాబోలు. ఆ...ఏమిటి విశేషాలు? అమ్మాయి ఏం చదువుతోంది?

జడ్జి—3 A.

స్వామి—బాగుంది. మొన్న నెవరో అన్నారండీ. మీరు రిటైరయ్యారనీ

జడ్జి—మొన్న నే...మూడు నెలలయింది.

స్వామి—అహా...బాగుంది. కాస్త చిక్కినట్టు కనిపిస్తున్నారు.

జడ్జి—అవును మరి! అస్తమానం ప్లీడర్లకి చెవులప్పగించి కూర్చోటం, ఇంటికొచ్చి కూర్చొని జడ్జిమెంట్లు వ్రాయడం మాటలా? అందుకనే "ఇక అంతా విశ్రాంతేగదా. ఈ సెలవుల్లో కాస్త మార్పుగావుంటుంది ఎక్కడకన్నా Excurtion లాగ పోదాం" అన్నది అమ్మాయి. సరే ఇక్కడ కొండలూ, అడవులూ చుట్టూ బాగావుంటాయి గదా అని ఈవూరు Select చేశాను. అమ్మాయికి కొండలూ అడవులూ అంటే సరదా లెండి.

స్వామి—(నవ్వి) ఈ కాలంలో అంతే లెండి. ఒక్కొక్కళ్ళకి వొక్కొక్క సరదా.

[సుకుమార్ ఇరవై రెండేళ్ళవాడు ఒక Camera తో వస్తాడు]

సుకు—Just a Minute Please (Camera Focus చేసి మీటనొక్కి) O. K. Thank You (లోపలికి వెళ్తాడు)

స్వామి—మా అబ్బాయి! వాడికి ఫోటోలు తియ్యడం సరదా లెండి.

జడ్జి—అల్లాగా... అహా.

స్వామి—ఏమిటో వాడికి పూర్వో మంచి స్నేహం లేదు. ఇలాగే అల్లరిగా తిరుగుతుంటాడు.

జడ్జి—అవును.

స్వామి—ఇంకో సరదా ఏదన్నా బాగుండును. ఈ Photo సరదాకంటె డబ్బు ఖర్చు యెక్కువ. రోజూ రెండుమూడు రూపాయిల ఖర్చు.

జడ్జి—అవును. మా అమ్మాయికూడా... ఇప్పుడు కాదు లెండి... చిన్నప్పుడు, మగవాళ్ళ భుజంఎక్కి తిరగటం – సరదా మా సర్వేంటు భుజాలు కాయలు కాచిపోయేవి. జ్ఞాపకం వుందిటే ఆనటేశంగాడు గోలెత్తేవాడు?

(విశాల నవ్వుతుంది; అందరూ నవ్వుతుంటే శేఖర్ మూడు కాఫీలు తీసుకొస్తాడు)

స్వామి—తీసుకోండి. నాకెందుకు తెచ్చావ్, ఇవ్వాళ శని వారం అని తెలయదూ? తీసుకుపో– ఫ్లాస్కులో పొయ్యి. సాయంత్రం ఎవరన్నా తాగొచ్చు, తీసుకుపో.

(శేఖర్ కాఫీ తీసుకువెళతాడు)

జడ్జి—ఆ, మేమిక్కడ ఈ వేసంగి అంతా గడపాలని అను కున్నాం. అందుకని దగ్గర్లో ఏదన్నా వసతి ఏర్పాట్లు చేస్తే బాగుంటుంది.

స్వామి—వేరొక వసతా! బాగా చెప్పారు. మీరీ వూరు రావటం– వేరే మిమ్మల్ని కాపరం పెట్టటమూనా! మేడ మీద గది ఖాళీ చెయ్యమని చెప్పాను. ఎన్నాళ్ళయినా సరే మీరిక్కడ వుండాల్సిందే! ఏవసతి కావాలంటే అది, అడిగితే తడవుగా ఏర్పాటుచేసాను,

జడ్జి—మీరల్లా అంటారని నేననుకుంటూనే వున్నా. కాని అనవసరంగా మాఖర్చంతా మీమీద ఎందుకూ?

స్వామి—ఖర్చేమిటండీ! మీరేమన్నా పరాయివారా? అక్కగారు గతించడంవల్లగాని- లేకపోతే వస్తూపోతూ వుండాల్సిన వాళ్ళంగాదూ? శేఖరం... శేఖరం... గది ఇంకా ఖాళీ చేయలేదేం? ఇప్పుడే వస్తా నాగండి.

జడ్జి—ఆ. అల్లాగే

(శేఖర్ వెళ్ళిన గదిలోకి స్వామినాథం వెళ్తాడు)

విశాల—అక్కగారంటారేమిటి?

జడ్జి—మీ అమ్మసంగతి. మీఅమ్మకు వీరు పెత్తండ్రికొడుకే! అమ్మ బ్రతికుండగా వస్తూపోతూండేవారు.

విశాల—ఈ వూళ్ళో ఏంచేస్తూవుంటారు?

జడ్జి—ఏదో Forest కంట్రాక్టులూ Quary కంట్రాక్టులూ. ఇప్పుడంతగా యేంచేస్తున్నట్టులేదు. ఇంకా సంపాదన ఎందుకులే. చుట్టుప్రక్కల చాలవరకూ ఈయనదే-బాగా గడించి పడేశారు...మనకుమల్లే కాకుండా,

విశాల—అహా!

(స్వామినాథం శేఖర్‌ని పిల్చుకొచ్చి శేఖర్‌ను మేడ మీదకు పంపి జడ్జిగారితో)

స్వామి—ఆ ... మీ గది సిద్ధమౌతోంది. మా శేఖర్ ఎప్పుడూ ఇక్కడే వుంటాడు. ఏం కావాలన్నా వాణ్ణి కేకెయ్యండి, తెచ్చిపెడ్తాడు.

జడ్జి—ఎందుకూ? మాతో జమానొచ్చాళ్ళేండి. వాడుచాలు.

స్వామి—ఆఁ, వాడికేం తెలుస్తుందీ- కొత్తవ్వాళ్లో? మావా డుంటాళ్లెండి.

జడ్జి—ఊఁ... మొత్తానికి మీజీవితాన్నికక్కడ భాగానే అల్లుకున్నారు...ప్రశాంతంగా.

స్వామి—ప్రశాంతమే. కాని ఊరుకో బుద్ధిపుట్టక ఏదో చిన్నచిన్న పన్లు చేస్తూనే వుంటాను. ఏం చేసినా ఎవరు తినను? దానిదోవన అదిపోయింది. ఉన్నది వీడొక్కడూ! ఉన్నదంతా వాడికి చాలకపోతుందా ?

జడ్జి—మీ అబ్బాయి పేరేమిటన్నారూ ?

స్వామి—నేనుపెట్టింది సుకుమారం. అప్పుడు సుకుమారం గానే వుండేవాళ్ళేండి. ఇప్పుడు వాడే 'సుకుమార్' అని పేరు మార్చుకున్నాడు. రండి మీగది చూపిస్తాను.

జడ్జి—ముసలయ్యా ముసలయ్యా. (ముసలయ్య బయటనుంచి వస్తాడు) ఈసామాను పైకిపట్రా.

[స్వామినాథం, విశాల, జడ్జివెళ్తారు. వెనకనే ముసలయ్యకొంత సామానుతో వెళ్తాడు. శేఖర్ క్రిందకు దిగివచ్చి పెట్టెచేత్తో Holdall భుజం మీద పెట్టుకుని మేడమీదకు వెళ్ళబోతుండగా సుకుమార్ ప్రవేశించి శేఖరునుచూశి(Camera Focus చేస్తూ]

సుకు—Wait - Wait ఆకాస్తవంగు ... ఆ...ఇంకా స్త... తలఎత్తు వంగు ... నావంకచూడు...నావంక...ఆ... కాస్త నవ్వు...

శేఖ—ఇంతబరువుతో నవ్వడ మెట్లాగండీ?

సుకు— Shut up.— నవ్వమన్నప్పుడు నవ్వాలి. ఏడవమన్నప్పుడు ఏడవాలి. (ఏదో జ్ఞాపకం చేసుకుంటూ) ఆ ... ఇప్పుడేమన్నానూ?

శేఖ—నవ్వమన్నారు.

సుకు—ఆ ... నవ్వే శెయ్యి ... తలదించకు ... అంతే ... (శేఖర్ నవ్వగా Photo తీసి) Good bye (శేఖర్ వెళ్ళబోగా) ఆగు; ఆ అమ్మాయుందే...ఆ అమ్మాయిని నిలువుగా నుంచోపెట్టి (Camera అడ్డంగా తిప్పిచూస్తూ) అడ్డంగా షూట్ చేస్తే ఎట్లావుంటుంది.

శేఖ—వద్దండి చచ్చిపోతుంది.

సుకు—ఏడిశావ్ Wonderful గా వుంటుంది. చూసుకో ఒకసారి తీసిచూపిస్తాను.

శేఖ—అల్లాగే...ఈ సామాను దించి వస్తాను. బరువుగా వుంది.

సుకు—ఆ ... వెళ్ళిరా (శేఖర్ మెట్లు ఎక్కుతుండగా) ఆగు...పోజు చాలా బాగుంది ... Idea ... అల్లాగే వంగు...(కెమేరా ఫోకస్ చేస్తూ) కాస్త వెనక్కి తల త్రిప్పు...నా వంక తిరుగు. ఆ, కాస్త ఏడు. ఏడుపు మొహం పెట్టాలి.

శేఖ—వస్తూనే వుంది. ఏడుపు.

సుకు—రానీ...రానీ...ఇంకా కొంస్త రానీ (ఫోటో తీసి) Co-ahead ఈ ఫోటో పేరు బ్రతుకుభారం, వెళ్ళు.

శేఖర్ మేజ మీదకు వెళ్తుండగా ముసలయ్య సామాను తీసుకు వెళ్ళటానికి క్రిందకు వస్తాడు]

సుకు—ఏయ్! ఇల్లారా. నీ పేరేమిటి?

ముస—ముసలయ్య.

సుకు—ముసలయ్య...Old Hag...నుంచో...సరిగ్గానుంచో (ఫొటో తీయబోగా)

ముస—నాకు మంచి మిలటరీ కోటుంది. ఆగండి వేసుకొస్తా, ఫొటో తీద్దురు గాని.

సుకు—Nonsense....Attention ...Hold arms.... (ముసలయ్య అవి చేస్తాడు. సుకుమార్ ఫొటోతీసి) Stand at ease ఆ చెప్పు ఎందుకొచ్చావిక్కడికి?

ముస—జడ్జీగారి జమాన్నండీ, జడ్జీగారితో వచ్చాను.

సుకు—జడ్జీగారితోనా! ఏం? జడ్జీగారు రాలేరూ? నువ్వెందుకూ తోడు? ఇక్కడ దొంగల్ని పడతవా? Nonsense జడ్జీగారి అమ్మాయితో వచ్చానను. Dispurse.

[ముసలయ్య సామాను కొంత తీసుకు పోయాడు. కొద్ది సామాను మిగిలింది. స్వామినాథం శేఖర్ వస్తారు]

స్వామి—(మిగిలిన సామాను చూపిస్తూ) ఇవికూడా తీసుకుపో (శేఖర్ మిగిలిన సామాను తీసుకుపోతాడు) ఒరేయ్! మాట (సుకుమార్ దగ్గరకు రాగా) ఆ, వచ్చినవాళ్లెవరో నీకు తెలుసా?

సుకు—ఎవరు? జడ్జీగారా! అమ్మాయి గారా? వాళ్ళతో వచ్చిన జమానుగారా?

స్వామి—ఆ తెల్సిందే! ఆ! ఆయన నీకే మామాత్తాతో తెలుసా?
సుకు—వాళ్ళమ్మాయిని చేసుకుంటే మామగారౌతారు.
స్వామి—ఆ! ఆ! మరి జాగ్రత్త. ఆ అమ్మాయితో కొంచెం జాగ్రత్తగా మాట్లాడి మంచిచేసుకో...
సుకు—ఓ...ఇకనించి Photo లన్నీ ఆ అమ్మాయికే తీస్తాను.
స్వామి—ఏడిశావులే!
సుకు—ఏం చేశాను?
స్వామి—కాస్త పిచ్చిధోరణి కట్టిపెట్టి ఆ అమ్మాయితో సరదాగా మాట్లాడాలి.
సుకు—పిచ్చిధోరణి! నాది పిచ్చిధోరణా?
స్వామి—కాదులే.
సుకు—Stand Erect (Camera focus చేస్తూ)
స్వామి—నీ దుంపతెగా ఇదేమిట్రా (నోరునొక్కుకుంటూ)
సుకు—(గట్టిగా) Stand Erect ...Stand Erect
స్వామి—(పోజులో నుంచొని) ఆ...కానీ...త్వరగా
సుకు—Hands up
స్వామి—ఆ (చేతులెత్తుతూ)
సుకు—O. K. (ఫొటోతీసి) Hands Down

[మేడదిగి శేఖర్ వస్తాడు. స్వామినాథం శేఖర్ నిచూసి]

స్వామి—ఏంచేస్తున్నారు వారూ?
శేఖ—సామాను సర్దుకుంటున్నారు.
స్వామి—ఎవరిసామానూ?

శేఖ—వారిసామానే! మనసామాను బయటపారేయించి వారిసామాను లోపలసర్దుకుంటున్నారు.

స్వామి—మనసామాను కాస్తేగావుంది. లోపలుంటే ఏం పోయింది?

శేఖ—ఏమో!

స్వామి—సరే! మనసామాను వేరే ఎక్కడున్నా సర్దు.

శేఖ—అల్లాగే (వెళ్ళబోగా)

సుకు—ఏయ్. శేఖర్! ఇట్లారా! మన సామాను లోపలుంచి, వాళ్ళసామాను బయటపారెయ్యి. మనింట్లో మనసామానుకు లేని అధికారం వాళ్ళసామానుకి మన యింట్లో ఎక్కణ్ణించొస్తుంది.

స్వామి—ఏడిశావ్...నువ్వూరుకో.

సుకు—ఏమంటావ్...(Photo తీయబోయినట్లు బెదరిస్తాడు)

స్వామి—ఏమన లేదురా బాబూ! ఊరుకో...ఆ...శేఖరం! వాళ్ళదగ్గరే ఉండి, ఏంకావాలో కనుక్కుంటూ వుండు. వాళ్ళకేంకావాల్సినాసరే ముందు తెచ్చిపెట్టి, తర్వాత నాకు లెక్క చెప్పు వాళ్లులేకుండాచూసి! అర్థమయిందా? ఫో...వాళ్ళకేం కావాలో చూడు.

సుకు—శేఖర్! ఇట్లారా! ఆవచ్చినాయన ఎవరో తెల్సా? మా మామగారు. ఆ అమ్మాయి. మా...మా (చిరు నవ్వు నవ్వుతు)

శేఖ—ఓహో ... ... ... (నవ్వుతాడు)

సుకు—(ఆపైన అననివ్వకుండానే) ఆ ... అదీ! ... కనక ముందు మాసంగతిచూసి ... తర్వాత వాళ్ళసంగతి చూడు ... సరేనా! అర్థమయిందా? ... ఛో... వాళ్ళ సంగతిచూడు.

శేఖ—నేను మీసంగతే చూస్తాను బాబుగారూ! వారికి వాక జమానువున్నాడుగా! చాలకపోతే ఇంకోణ్ణైవన్నా యినా వాళ్ళదగ్గర పెట్టండి.

స్వామి—అదేమిటి?

శేఖ—ఇంటిపనంతా నేనేచూస్తాను. మీకెంత చాకిరీ చేయమన్నా చేస్తాను. వారిదగ్గరమాత్రం నన్నుంచకండి.

స్వామి—ఎందుకనీ? నువ్వనేదేం అర్థంకావటంలే.

శేఖ—వారిదగ్గర నేను పనిచేయలేను.

స్వామి—కారణం?

శేఖ—అడక్కండి. చెప్పలేను. వారంటే నాకు...అహా! వద్దండీ! వారిదగ్గరికూడా నన్ను పంపవద్దు.

స్వామి—ఏమిటోయ్ గోల.

శేఖ—వద్దు...మీరేపని చేయమన్నా చేస్తున్నాను. వక్క పనీ చెయ్యమనవద్దు. అంతేనే కోరేది.

స్వామి—ఊఁ ... సరే. ఏదోచూద్దాం ... కానీ ...

సుకు—Bravo శేఖర్ ... మానాన్న తలవంచిన వాడివి నా తర్వాత నువ్వే.

[ ముసలయ్య - విశాలవస్తారు. ముసలయ్య సరాసరి బయటకు వెళ్ళిపోతాడు. విశాలచేతిలో కలం కాగితం (ప్రవేశిస్తారు) ]

విశా—ఇదిగో! ఇక్కడేవున్నారు. ఏమండీ స్వామినాథం గారూ? మనం కాసేపు మాట్లాడాలి.

స్వామి—అల్లాగే ... రా ... అమ్మా రా ... ఇట్లా కూర్చో.

విశా—ఆ! చెప్పండి. ఈ చుట్టుప్రక్కల ఏ ఏ కొండలున్నాయి? ఏవాగులున్నాయి? ఎక్కడో ఒక జలపాతం కూడా వుందట. చూడవల్సిన పరిసరాలు ఏమున్నా సరే ... చెప్పండి. అన్నీ ఒకలిష్టుగా వ్రాసుకుని ఒక ప్రోగ్రామ్ Chalk Out చేస్తాను.

స్వామి—ఓ అల్లాగే ... అందాకా ఎందుకూ? మావాడు అన్నింటినీ ఫొటోలు ఇదివరకే తీసిపెట్టాడు. కావాలంటే Photo లు చూసి నిర్ణయించుకోవచ్చు. చూపించరా! నీ ఫొటోలు...తీసుకొచ్చిచూపించు.

సుకు—(కోపంగా) నువ్వడిగితే చూపించేవి కావులే. అడగవల్సినవారడిగితే...ఆలోచిస్తాను.

విశా—ఓ! నేనే అడుగుతా. (లేచివచ్చి వయ్యారంగా వేళాకోళంగా వంగి) ఏమండీ... మీరుతీసిన Photo నాకు చూపిస్తారా?

సుకు—(వేళాకోళం చేస్తూ) O! Yes ...తప్పకుండా చూపిస్తాను. కాని వొక్కసారి ఈ వయ్యారంమాని మామూలుగా అడుగుతారా? (తనూ ఆమెను అనుకరిస్తూ అంటాడు.)

స్వామి—సుకుమారం

సుకు—(కోపంగా) My name is సుకుమార్.

స్వామి—పెద్దాడివి అవుతున్నా, కొంచెతనంపోలేదు. నువ్వేం అనుకోకమ్మా... వాడంతా అదో మాదిరి. నీకాకావల్సినవన్నీ మా శేఖరం చెప్తాడు. శేఖర్...రా...అన్నీ చెప్పు... ఆ! నేను నాన్నగారితో మాట్లాడివస్తాను. ఏం? రారా సుకుమార్...రా.

సుకు—నేనెందుకూ...పెళ్ళి మాట్లే లేవుగా.

స్వామి—ఏడిశావ్ ... (అనబోయి ఆగి కోపంగా చూసి) ఏం లేదులే. (వెళ్తాడు)

విశా—ఏమయ్యా! ఈ చుట్టుపక్కల విశేషాలేమున్నాయో అన్నీ చెప్పు.

శేఖ—ఏమున్నాయండీ! పదిపన్నెండు కొండలున్నాయి. ఆకొండలనిండా వాగులూ...చెట్లూ!

సుకు—ఆ చెట్లనిండా దొంగలూ...

విశా—ఆ! దొంగలా!

సుకు—వాళ్ళకుతోడు దెయ్యాలుకూడా!

విశా—పరిహాసాలా?

సుకు—పరమసత్యం. ... జడ్జీగారమ్మాయికూడా దొంగలంటే భయమేనా?

విశా—నిజంగానేనా! (శేఖర్ వంక తిరిగి) ఏమయ్యా?

శేఖ—ఉంటానికి వున్నారుగాని ... వాళ్లు మనజోలికి రారులెండి.

విశా — ఏదీ! ఇంతవరకూ కబుర్లతోనే సరిపోయింది.

జడ్జి — పోన్లే! మధ్యాహ్నం తీరుబడిగా వుంటుంది. దాని సంగతి ఆలోచిద్దాం.

స్వామి — అయినా సరదాగా సాయంకాలం అటూ యిటూ తిరిగి వచ్చేవాడికి ఈ Programm· లూ Bluep int లూ దేనికీ?

జడ్జి — ఒట్టి సరదాయే కాదంనోయ్! అమ్మాయి Nature Study కూడా చేస్తుంది.

స్వామి — Nature Study యూ! చూడమ్మా! మా అబ్బాయి Nature కూడా కాస్త Study చెయ్యరాదూ?

విశా — చేస్తాను...గానీ కొంచెం Difficult Subject. ప్రయత్నిస్తానులెండి.

స్వామి — Difficulty ఏముందీ? ఇక్కడ సరైన సహచర్యం దొరకక ఇలాపాడై పోయాడు. ఏనో మీలాంటి వాళ్ళతో నాలుగు రోజులు తిరిగితే దోవన బడతాడు. అలా అల్లరిగా తిరుగుతున్నాడని, మరీ పిచ్చివాడికింద లెక్క కట్టెయ్యకండి.

జడ్జి — అబ్బే! నే నెంతో ఆలోచిస్తేగాని ఒక జడ్జిమెంటు ఇవ్వను. పోనీ ఏ కాలేజీలోనో చేర్చి చదివించక పోయారా!

స్వామి — చదువుతున్నవాడే. B A. దాకా వచ్చాడు. కాని వాడితల్లి చనిపోయాక నాకూ వైరాగ్యం పుట్టింది.

అప్పట్నించి అన్ని వ్యాపారాలు ఆపేసి ఏదో యిల్లా జపం తపం చేస్తూ కుంటూ కాలం గడుపుతున్నాను. ఒంటరిగాణ్ణి వీడే వుద్యోగమో వెలగబెట్టి నాకు పెట్టక్కర్లేదు గదా. ఉన్న దేదో నిర్వహించుకొంటే అదే చాలు. అందుకని వాణ్ణి యిక్కడుంచాను.

జడ్జి—అదీ నిజమే లెండి.

స్వామి—(విశాలతో) ఈ నాలుగు రోజులూ నీ వెంట వేసుకు తిప్పావంటే మా వాడూ నొక దారిన బడతాడమ్మా?

విశా—ఓ...అల్లాగే లెండి! అనవసరంగా కాలంవృధాఅయిపో తుంది; ఈ శేఖర్ కీ ప్రాంతమంతా బాగా తెలుసట నాన్నా! ఇతన్ని మనతో రమ్మందామా?

జడ్జి—అలాగే; ముందునువ్వు Programme వెయ్యాలిగా?

విశా—అదెంతసేపూ? యిప్పుడే పూర్తిచేసేస్తాను. (శేఖర్ తో) రావయ్యా! మనం మేడమీదకూర్చుని ప్రోగ్రాం తేల్చిపారేద్దాం.

[ విశాల - శేఖరూ మేడమీదకు వెళ్తారు ]

జడ్జి—వెళ్ళారు. ఆ. స్వామినాథంగారూ? మీతో ఒకసంగతి మాట్లాడాలి.

స్వామి—ఆ. చెప్పండి.

జడ్జి—నేను కేవలం. ప్రకృతిసౌందర్య రసాస్వాదనకే ఈ వేసంగి వృధాచేయటాన్కి రాలేదు. వేరే రెండుపనులు న్నాయి. ఒకటి అమ్మాయి పెళ్ళివిషయం – మాట్లాడాలనీ, ... రెండోదీ.. ...

స్వామి—అహా! రెండోదీ ...?

జడ్జి—ఇంకొక రహస్యమైన పనుంది. ఆసంగతి అపర్ణాయి కూడా తెలియదు. దీన్ని మీరూ రహస్యంగానే వుంచాలి.

స్వామి—అల్లాగే.

జడ్జి—షుమారు పది సంవత్సరాలక్రితం ఈవూళ్ళో మా దూరపు బంధువు ఒకడుండేవాడు - మా పినతాతగారి మనమడు. వాడికిచాలా ఆస్థివుండేది. కాని వాడు ఆస్థి నంతా పాడుచేసేస్తుంటే బంధువులు కొందరు బలవంతాన కొంతఆస్థిని భార్యపేర పెట్టించారు. వాడికీ ఒక్కడే కొడుకు. కొన్నాళ్ళయినతర్వాత తనపేరనవున్న ఆస్తంతా పాడుచేసి వాడు భార్యపేరన వున్నదాన్నికూడా తిరిగి వ్రాయమని బలవంతపెట్టాడు. ఆ కుర్రవాడికేం లేకుండా పోతుందనే భయంతో ఆమెగారు త్రిప్పివ్రాయలేదు. దాంతో ఆలుమగలకు వైషమ్యాలు పెరిగి వాడు చివరికి ఆమెను హత్యచేసి ఆపిల్లవాణ్ణి తీసుకుని పారిపోయాడు. పోలీసు లెంత వెతికినా చిక్కలేదు.

స్వామి—అహా!

జడ్జి—వాడిసంగతిగాని, ఆకుర్రాడిసంగతికాని నాలుగేళ్ళ క్రిందటివరకూ ఎవ్వరికీ తెలియదు. నాలుగేళ్ళక్రింద నాదగ్గర ఒక కేసుపడేశారు. దాన్లో మైనరైన కుర్రాడు మేజరయ్యాడనీ, వాడిపేరనున్న పొలం పాడుచేస్తున్న వాడి-

స్వాధీనంలో వుందనీ, ఆసాగుచేసేవాడు మేజరైన కుఱ్ఱాడికి షాల్తం స్వాధీనం చేయ నిరాకరించాడనీ, కుఱ్ఱాడికి స్వాధీనంచేస్తూ డిక్రీయివ్వమనీ కోరారు. అప్పుడే ఆకుఱ్ఱ వాడి బాపతువారెవరో, కుఱ్ఱాణ్ణి నాదగ్గరకు తీసుకువచ్చి వాడికీ మాకూ ఉన్న బంధుత్వం ఏకరువుపెట్టి "తలిదండ్రీ లేనికుఱ్ఱవాడు సహాయం చెయ్య" మని కోరారు.

స్వామి—ఊహూ.

జడ్జి—నేను చాలా ఆలోచించి ఆ కుఱ్ఱవాడే, అసలుకుఱ్ఱవాడని నమ్మకంలేక ఆకుఱ్ఱవాడు "బ్రతికి వున్నాడంటానికి ఆస్కారంలేదని" తీర్పుచెప్పాను. తీర్పు అయిపోయింది కనక ఆకుఱ్ఱాడు బ్రతికి వున్నా లేనట్టే. డబ్బులేక కాబోలు వాళ్లు నాతీర్పుమీద అప్పీలుకూడా చేయలేదు.

స్వామి—అహా.

జడ్జి—కనక ఆ ఆస్తి మనకు దక్కుతుంది.

స్వామి—మీకా?

జడ్జి—ఆ, నాకు. ఇక మిగిలినవాకసులం మనమేగా? ఎల్లాగైనా ఆ అస్తి ఎక్కడుందో తేల్చి మనం యిప్పుడు స్వాధీనం చేసుకోవాలి.

స్వామి—అదా సంగతి?

జడ్జి—ఆ కోర్టులో కేసుపడేసినప్పుడే ఆ ఆస్థి వివరాలుకూడా పడేశారు. వాటినకళ్ళు నాదగ్గరున్నాయి. యిప్పుడా ఆస్థి ఎవరిస్వాధీనంలో వున్నదీ, ఎక్కడున్నదీ అంతా భోగట్టా

తీస్తే స్వాధీనంసంగతి తర్వాత చూద్దాం. ఇదిగో, ఆస్థి వివరాలున్న కాగితాలు. (కాగితాలు యిస్తాడు, స్వామినాథం తిరగేస్తూ)

స్వామి—దాని కేముంది? కరణంగారితో మాట్లాడి అన్నీ తేలుస్తాలెండి. కాని ఆ కుర్రవాడింకా బ్రతికివున్నాడా?

జడ్జి—ఏమో? అది నాకేం తెలుసు?

స్వామి—మీదగ్గరకొచ్చినకుర్రాడు అసలుకుర్రాడేనా?

జడ్జి—నిజానికి వాడే అసలుకుర్రాడు. కాదంటానికీ ఆధారమేమీ లేదు. కాని నేను అప్పటినుంచీ జాగ్రత్తపడ్డాను లెండి.

స్వామి—అహా - ఇక యిబ్బందిలేదన్నమాట.

[ స్వామినాథం కాగితాలు తిరగేసిచూస్తూ తెల్లబోతాడు; ఏదో ఆలోచిస్తుంటాడు; అది గమనించి ]

జడ్జి—అదేమిటి; ఆలోచిస్తున్నారు?

స్వామి—(కోలుకొని) ఆ, ఏంలేదు. ఆ, అమ్మాయి పెళ్ళి విషయం ఏదో అన్నారేమిటీ?

జడ్జి—అదా? నేనీవూరు రాకముందే మీఅబ్బాయికి మా అమ్మాయినిచ్చి సంబంధం కలుపుకుందామనుకున్నాను కాని మీఅబ్బాయిని చూచిన తర్వాత మా అమ్మాయి వప్పుకుంటుందా అని నా కాస్త అనుమానంగా వుంది.

స్వామి—వాడి కొంటెచేష్టలవల్ల నేగా ... అవును...మీకు వాడికి పిచ్చివుందా అనే అనుమానం కలగవచ్చు. కాని ఇంతట్లోనే పిచ్చివాడనీ నిర్ధారణకి వచ్చెయ్యకండి.

జడ్జి—అబ్బే! నేనే విషయంలోనూ అంతత్వరగా Judge-ment యివ్వను.

స్వామి—ఒక్కమాట వినండి ... నేనేదో తాపత్రయపడి సంపాదించాల్సినన్నాళ్ళూ సంపాదించాను. ఇకవాడికి పెళ్ళిచేసి "కృష్ణారామా" అనుకుంటూ కూర్చోవాలనే అభిలాష. కాని మళ్ళా మీరు నన్ని సంసారవనవాసం లోకి దింపుతున్నారు...దిగేవాణ్ణి ఎట్లానూ దిగుతున్నా గనక... నేను మీవిషయంలో మీ క్కావల్సిన పనంతా చేసి పెడ్తాను. మీఅమ్మాయిని మీరు పెళ్ళికి వప్పించే ప్రయత్నం మీరు చెయ్యాలి.

జడ్జి—నాప్రయత్న లోపం లేకుండా ప్రయత్నిస్తాను.

స్వామి—మావాడికి ఏమతిభ్రమణా లేదని నేను నిశ్చయంగా చెప్పగలను. కావాలంటే రెండు రోజుల్లో వాడు మామూలు తెలివితేటల్తో కనిపిస్తాడు. అదంతా ఉంది లెండి.

జడ్జి—అల్లాగే. మరి మనం కరణంగారి దగ్గరకెళ్ళి వద్దామా?

స్వామి—అదేకాస్త చిక్కుపని; మాకరణంగారు కాసు పడితే నేగాని నోరు మెదపడు.

జడ్జి—లంచం యివ్వాలా!

స్వామి—ఆ! పని చేయించుకోవాలంటే...యివ్వాలిమరి.

జడ్జి—నేను జడ్జినికదా! నాదగ్గరకూడా లంచం...

స్వామి—నిరభ్యంతరంగా తీసుకుంటాడు.

జడ్జి—సరే కానివ్వండి, ఏదో...కావాలంటే అల్లాగే చెయ్యి తేడుపువాం...మరి ఎప్పుడు వెళ్దాం...ఇప్పుడు వెళ్దామా?

స్వామి—ఓ అల్లాగే వెళ్దాం...కాని అక్కడికి మీరుకూడా ఎందుకూ? మీరు రావటం అట్టే బాగుండదేమో! నేను వెళ్ళి మాట్లాడివస్తాను.

జడ్జి—నేను ఒంటరిగా యిక్కడ వుండేంచేస్తానూ, నేనూ వస్తా. పదండి.

స్వామి—సరే రండయితే! మిమ్మల్ని యివతలనుంచో పెట్టి వెళ్ళి నేను మాట్లాడుతాను. చొక్కా వేసుకువస్తా.

[చొక్కా వేసుకోవడానికి ప్రక్కగదిలోకి వెళ్తాడు విశాల శేఖరు మేడమీదనించి దిగి వస్తాడు]

విశా—Programme వేశాం... నాన్నా! ఇదిగో (కాగితం యిస్తుంది)

జడ్జి—బాగుంది...తర్వాత చూస్తాలే, ఇప్పుడు కాస్త పనుంది (స్వామినాథం చొక్కా వేసుకొంటూ వస్తాడు. బల్లమీద కాగితాలు స్వామినాథానికి చూపిస్తూ) మీరా కాగితాలు లోపల దాయండి, మేము వూళ్ళోకి వెళ్ళి వస్తామన్నా...

విశా—ఏం పని?

జడ్జి—వేరేపని వుందిలే. ఇప్పుడే వస్తాంలే. ఈలోపున నువ్వా Programme అంతా Fix చేసి చక్కగా కాగితంమీద వ్రైట్ చేసి వుంచు.

[స్వామినాథం కాగితాలు డ్రాయరులో దాచిరాగా యిద్దరూ. కల్సి వెళతారు)

శేఖ—మీనాన్నగారికి మీలాగ కొండలవెంట తిరిగే సరదా లేదనుకొంటాను.

విశా—ఆయనకే సరదాలేదు. ఇప్పుడిప్పుడు కాస్త డబ్బు నిలవచెయ్యటం సరదాగా ఉన్నట్టుంది.

శేఖ—అట్లా అంటారేం? ఏం నిలవవేశినా మీకోసమేగా?

విశా—నాకోసమేనేమో! కాని నాకోసమయితే ఈ దుర్మాశ అక్కర్లేదుగా, (ఆలోచించి) అది నాకోసమే అయినా ఈ Trip మాత్రం నాకోసంకాదు.

శేఖ—అదేమిటండీ! అలా అంటారేం?

విశా—ఎవరిదో ఆస్థి ఎవ్వరికీ కాకండా పడివుందట, అదేదో మాకు వస్తుందట. ఇది చాలా రహస్యంలే, ఉండబట్టలేక చెపుతున్నాను. ఆ Drawer లో కాగితాలుపెట్టి వెళ్ళారేం! ఆ కాగితాల్లో ఆస్థివివరాలు పొలం నంబర్లూ వున్నాయి నేనూచదివాను.

శేఖ—ఆస్థి ఎవరిదో?

విశా—ఏమో! ఎవరికో ఒక త్రాగుబోతు వెధవదట ... అదంతా యిప్పుడెందుకులే. మాట్లాడుతుంటేనే ముసలి వాసన కొడుతుంది. ఇంకా చూడవలసినవేం లేవూ? అన్నీ యింతేనా...

శేఖ—అంతే. ఇంకేం లేవు.

విశా—లేవంటావేం...మీఅయ్యగారి అబ్బాయిగారు లేరూ!
శేఖ—(నవ్వి) వారిని మీరు చూచారుగా ?
విశా—పాపం, చూట్టానికి బాగానే ఉంటాడు.
శేఖ—వారికేం లెండి; శ్రీమంతులు ... వారెల్లాగున్నా గడచిపోతుంది.
విశా—బుర్ర లేకపోయినా గడచిపోతుందంటావా ?
శేఖ—ఎల్లాగైనా గడచిపోతుంది...మీబోటివారిని పెళ్లాడితే.
విశా—ఆ !నాబోటిది చేసుకుంటుంది...గతిలేకపోతే. తెలివి లేని భాగ్యవంతునికంటే తెలివిగల పేదవాడు చాలనయం.
శేఖ—ఎందుకూ ? తిండిపెట్టలేనివాడికి....
విశా—బ్రతకటం తింటానికైతే నువ్వు చెప్పింది నిజమే; కాని బ్రతికేది తిండితిని పడివుండటానిక్కాదుగా ?

[బయటనుంచి ముసలయ్య వస్తాడు]

విశా—ముసలయ్యా! నన్నెవర్ని పెళ్ళి చేసుకోమంటావ్ ? తెలివి తక్కువ భాగ్యవంతుణ్ణా ? తెలివి గల పేదవాణ్ణా ?
ముస—ఎందుకమ్మా నన్నడుగుతారు? నేను చేసుకోమంటే చేసుకుంటారు గనకనా ?
విశా—నువ్వు చేసుకోమంటే చేసుకోను గాని వద్దంటే మానేస్తాను.
ముస—అదే నే ననేది. మా ముసలాళ్ళ మాటలు మీకు నచ్చవ్. ఈ శేఖర్ లాంటి పడుచాళ్ళ మాటలంటే భాగా నచ్చుతాయి,

విశా—ఈ శేఖర్ మాటలు నా కసలు నచ్చటం లేదు.
ముస—మరి ఆ పిచ్చిబాబుగారి మాటలో! (నవ్వుతాడు)
విశా—ఏమిటది ? నువ్వా అలా అన్నావ్.
ముస—ఏమీ లేదులెండి. మన బాబుగారు ఈ బాబుగారు అనుకుంటున్నారు లెండి.
విశా—ఏం అనుకుంటున్నారు ?
ముస—మీ పెళ్ళి చేయాలని...
విశా—అనుకుంటున్నారా!
ముస—ఇప్పుడే; యిటు మాట్లాడుతూ వెళ్తున్నారు. మీకూ ఆ చినబాబుగార్నిచ్చి......
విశా—ముసలయ్యా! నన్ను చిన్నప్పట్నించీ పెంచావు... ఒక వేళ నన్నెవరన్నా పొడిచి చంపేస్తుంటే ఏంచేస్తావ్ ?
ముస—ఆ...అంతవరకూ రానిస్తానా చూస్తూ ?
విశా—రానివ్వవ్. ఆ పొడిచేది, మా నన్నే అయితే ?
ముస—అదేమిటమ్మా అలా అంటారు ?
విశా—ఇప్పు డంతకంటె తక్కువేమాత్రోంది ? ఈ వూరు రావడంలో ఈ వుద్దేశ్యం కూడా వుందన్న మాట! ఊఁ, శేఖర్! ఒక్కసారి సుకుమార్ ఎక్కడున్నాడో పిల్చుకొస్తావా ?
శేఖ—ఆ. (లోపలి గదిలోకి వెళతాడు)
ముస—అయితే పెళ్ళి మీ కిష్టం లేదా అమ్మా?
విశా—ఎట్లా వుంటుంది? ఆ పిచ్చి మాలోకాన్ని చేసుకోటాని కెవరి కిష్టముంటుంది ?

ముస—కాని నాన్నగారు వప్పుకున్నట్టే మాట్లాడుతున్నారే?

విశా—ఆగు. సుకుమార్ వస్తున్నాడు. నాకు తెలియకుండా వాళ్ళు నాటకం ఆరంభిస్తే, వాళ్ళకు తెలీకుండా నేను నాటకం పూర్తి చేస్తాను.

సుకు—(వస్తూనే అసహ్యించుకుంటూ ముసలయ్యతో)
Old hag! Old hag with a Damsel. Get out Get out First అరే! నీకే చెప్పేది! అర్థం కాలే!

ముస—Get out అంటే అర్థమయిందిలెండి. Get out ఎటూ అని ఆలోచిస్తున్నా...ఊఁ...బయిటికే Getout. (బయటకు వెళతాడు)

విశా—వాణ్ణి వెళ్ళగొట్టా రెందుకూ?

సుకు—మీరు నాకు కబు రెట్టా రెందుకూ?

విశా—శేఖర్ నే పిల్చానని చెప్పాడా?

సుకు—లేదు. మీరు చెబుతుంటే నేనే విని వచ్చాను.

విశా—మీరు చాలా మంచివారే గాని...అంత వెళసరంగా మాట్లాడతారేం?

సుకు—కొందరి మొహంచూస్తే అట్లా మాట్లాడ బుద్ధి పుడుతుంది.

విశా—నా మొహం చూస్తే కూడానా?

సుకు—వళ్ళు మంటకూడా పుడుతుంది.

విశా—ఏం! నేనేం పాపం చేశాను?

సుకు—మీనాయనకు నువ్వు పుట్టటమే!

విశా—ఆ!!

సుకు—ఆయన గొప్పవాడని నీకు గర్వం.

విశా—మీరు తెలివితక్కువగా కనిపిస్తారుగాని తెలివిగల వారే - నే నొక్క టడుగుతాను చెప్తారా?

సుకు—చెప్తానని గ్యారంటీ యివ్వాలా?

విశా—అక్కర్లే - నేను మీదగ్గరకొచ్చి పెళ్ళిచేసుకోమంటా ననుకోండి. మీ రేమంటారు?

సుకు—మీరు నాదగ్గరకొచ్చి ఎవర్ని పెళ్ళిచేసుకోమంటారు?

విశా—అదే, మిమ్మల్నే.

సుకు—వళ్ళు దగ్గరుంటే ఆపని చేయవద్దంటాను.

విశా—ఏం?

సుకు—తర్వాత నాకు వెర్రెత్తి ఏమన్నా చేస్తే నామీద కేసు కూడా వుండదు.

విశా—నన్ను పెళ్ళిచేసుకుంటే వెర్రెత్తుతుందా?

సుకు—నిన్ను చూస్తేనే వెర్రెత్తుతుంది.

విశా—పోనీ ... మీనాన్నగా రడిగితేనో?

సుకు—ఆయన అడక్కపోయినా వెర్రెత్తుతుంది.

విశా—నేను వేళాకోళం ఆడటంలేదు.

సుకు—అవును. వేళాకోళం ఆడటం చేతకావద్దూ.

విశా—మీనాన్నగారు మిమ్మల్ని అడగపోతున్నారు.

సుకు—ఇదివరకే అడిగారు.

విశా—అహా! అయితే మీరేమన్నారు?

సుకు—చేసుకుంటాను అనలేదు. చేసుకోనూ అనలేదు.

విశా—మరీ ఈతడవ వచ్చి అడిగితే ఏమంటారు ?

సుకు—అల్లాగే అంటాను.

విశా—ఆ...అలాగే అంటారా ?

సుకు—మరేమనమంటావేం ?

విశా—నేను అనమన్నట్టు అంటారా ?

సుకు—నాకు నచ్చితే అలాగే.

విశా—అలాగైతే ... "చేసుకోనూ" అనండి.

సుకు—ఆమాట నువ్వు అను.

విశా—నేను అలాగే అంటాను. మరి మీరో ? ఏమంటార

సుకు—మాటలేం అనను.

విశా—మరి ?

సుకు—వెంటనే Load చేసి Shoot చేసేస్తాను.

విశా—చంపేశారు.

సుకు—భయంలేదులే. Camera తో Shoot చేస్తానులే.

విశా—వద్దులెండి. "చేసుకోనూ" అనండి చాలు.

సుకు—ఏం ? అట్లా ఎందుకనాలి?

విశా—నాకు మీరంటే యిష్టంలేదుగనక ? మీరంటే అ
హ్యాంగనక; మీరంటే వళ్లు మంటగనక.

సుకు—అయితే సరే, అలాగే అంటాలే.

విశా—అమ్మయ్య ! మీరు మంచివారే, మనిద్దరికీ ఒక ర
కుదిరినట్టేగా ! చాలా సంతోషంగావుంది. ఒక్క
తియ్యరూ.

సుకు—నువ్వడిగావ్ గనక తియ్యను. కానీ, ఇదివరకే నీకూ, శేఖర్కి తీసిన ఫోటోవుంది. అది తెస్తానాగు.

విశా—ఇదివరకే నాకు Photo తీశారా!

సుకు—ఈ ఇంట్లో అడుగుపెట్టినతర్వాత Photo తీయించుకోకుండా ఎవ్వరూ ఎక్కడికీ పోలేదు.

విశా—ఎట్లా తీశారు?

సుకు—మీరిద్దరూ యిక్కడవుండగా, అదిగో ఆ గుమ్మం ధగ్గరుండి తీశాను.

విశా—నే చూడలేదే!

సుకు—తెర అడ్డంవుందిగా! ఆగు వస్తా, దాన్నింకా De lope చెయ్యాలి.

విశా—మీరు Photo లు తియ్యడమేకాకుండా Devoloping, Printing కూడా చేస్తారా.

సుకు—Enlarging కూడా చేస్తాను.

విశా—మరిమీరు తీసిన Photo లన్నీ నాక్కూడా చూపించరూ?

సుకు—ఓ! రండి చూపిస్తా.

[ ఇద్దరూ కింది గది లోపలికి వెళతారు. మరికొంచెం సేపటికి శేఖర్ అటునుంచే తక్కుతూ తారుతూవచ్చి అటూ యిటూ చూశి ఎవ్వరు లేరని నిశ్చయించుకుని వెళ్ళి Drawer లో వున్న కాగితాలుతీసి చదువుతుండగా విశాల ప్రవేశించి ]

విశా—ఏమిటది? ... ... ఏమిటో చదువుతున్నావ్!

శేఖ—ఏంలేదు ఏదో ........

[ శేఖర్ ఖంగారుపడి కాగితాలు దాచేస్తాడు ]

విశా—నీకు చదువొచ్చా.

శేఖ—ఆ. కొద్దిగా.

విశా—ఏంకాగితాలవి. (Drawer లో కాగితాలు తీసిచూసి)

ఇవా! ఇవి నువ్వెందుకు చదువుతున్నావ్.

శేఖ—అహా. ఊరికేనే.

విశా—ఊరికేనా! అహ! నీకీ ఆస్థివిషయం ఏమన్నా తెల్సా?

శేఖ—ఏం తెలియదు ?

విశా—తెలియకపోతే ఏమిటీ నీకీ కుతూహలం ? చెప్పు. లేక పోతే, ఇవి చూశావని నాన్నగారితో చెప్తాను,

శేఖ—తప్పుచేశాను, క్షమించండి. ఇక ఎప్పుడూ ఇలాంటి పని చేయను. ఆ, ఆస్తి ఈవ్రాళ్లో ఎవరిదా అని చూస్తున్నా అంతే.

విశా—ఊహూ, సరేలే. (మేడమీదకు వెళ్ళబోగా)

శేఖ—అమ్మా! అమ్మా! (విశాల ఆగగా) వ్వరికీ ఈవ సంగతి చెప్పకండమ్మా.

విశా—సరేలే, ఇంతలో ఏం మునిగిపోలేదుగా.

—: తెర :—

## రెండవ రంగము

[అదే రంగం. రెండు రోజు లయిన తర్వాత విశాల మేడ మీద నుంచి దిగి కిటికీ వద్దకు వెళ్ళి ప్రకృతిని తిలకించి ఆనందంతో పాట పాడుకుంటూ బయటకు వెళుతుంటుంది. బయట నుంచి పాట వినిపిస్తూటుంది. సుకుమార్ ప్రవేశిస్తాడు. పాట విని ఆనందించి కిటికీ వద్దకు వెళ్ళి కెమేరా ఫోకస్ చేస్తుండగా ముసలయ్య ప్రవేశిస్తాడు.]

ముస—ఏమిటి బాబూ ఫొటో తీస్తున్నారూ ?

సుకు—Old hag! అది నీ కెందుకూ? ఇది అంతా నవయువకుల విషయం.

ముస—ఆళ్లైవరు బాబూ నవయువకులంటే ? (కిటికిలోంచి చూసి) ఓహో...నవయువకులంటే అమ్మాయిగారూ... శేఖరూనా ?

సుకు—ఆ! అదే. నీ కక్కుర లేందీ, నా క్కావాల్సిందీ, నీ క్కావాల్సింది యిటువుంది, ఇటు (రెండోవైపుకి తీసుకెళ్ళి కిటికీలోంచి బయటకు చూపిస్తాడు) Old hag Old hags నే చూడాలి.

ముస—అటు వేపు తోటలో చిన్నోరూ, ఇటు వేపు తోటలో పెద్దోరునా!

సుకు—ఆ, వాళ్ళసంగతినే చూస్తాను...వీళ్ళ సంగతి నువ్వు చూడు.

ముస—పెద్దారి సంగతి పెద్దారే చూసుకుంటారు లెండి...
చిన్నారినే యిద్దరం కనిపెట్టుందాం.

సుకు—చిన్నారిని కనిపెట్టటానికి నేనున్నా. Camera చాల్లే.
ఇటువైపుకు వచ్చావంటే డొక్క చీల్చేస్తాను. ఫో.

[ఒక కొత్తవాడొస్తాడు. శేఖరు ఈడువాడు, వేషం కూడా
కొంచెం మోటుగా వుంటుంది.]

కొత్త—శేఖరున్నాడాండీ?

సుకు—ఉన్నాడు.

కొత్త—కాస్త పిలుస్తారా?

సుకు—ఇప్పుడు చాలా పనిమీద వున్నాడు రాడు.

కొత్త—కాస్త మాట్లాడాలండి.

సుకు—Shutup!మళ్ళీ మాట్లాడకు. ఫో!

కొత్త—అలాగేనండి. (కొత్తవాడు వెళతాడు)

ముస—ఏదోపనిమీద వొచ్చినట్టున్నాడు, పోనీ పిలుద్దామా?

సుకు—వద్దు.

ముస—ఏం పనో పాపం! శేఖర్ కూడా పెద్దపనిమీదేం
లేదుగా?

సుకు—వాడి పని నాకు తెల్సులే! వాడెవరో తెల్సా?

ముస—మీకు తెల్సా...

సుకు—ఆ...పెద్దదొంగ...దొంగలకు నాయకుడు.

ముస—అబ్బే! వాడి మొహం చూస్తే అల్లాలేదే.

సుకు—వుండదు. మానాన్న మొహం ముందా దొంగలాగా?

ముస—మీనాయనగారూ దొంగే నంటారా?

సుక్కు—Shutup! ఆమాటలోపల అనుకో. పైకి అంటే Shoot చేస్తాను.

ముస—వద్దండోయ్ వద్దు. (బయట కారు హారను మ్రోగగా విని) అదిగో! అయ్యగారు వస్తున్నారు. ఇటుపోతా.

[లోపలికి వెళతాడు. సుకుమార్ మేడమెట్లవెనక దాక్కుంటాడు, స్వామినాథం జడ్జి వస్తారు]

స్వామి—మీ రెన్నన్నా చెప్పండి. కరణం గారికి లంచం పెట్టందే లాభం లేదు. మీరు జడ్జీగారని ఆయనేం మొహమాటం చూపించడు.

జడ్జి—కాని నా అంతటివాణ్ణి, నన్నే లంచంపెట్టమంటారా?

స్వామి—ఆ... పెట్టాల్సిందే! చూడటంలే... ఎన్ని సార్లు తిప్పుతున్నాడో. ఇటువంటివన్నీ వస్తాయనే నాకు "పవర్ ఆఫ్ అటర్నీ" పారెయ్యమన్నది. దాని సంగతి మీరు మాట్లాడరు, సరిగదా... అధమం... బ్రతికున్న ఆ కుర్ర వెధవ పేరన్నా చెప్పరు. నామీదనమ్మకం లేదాఏం?

జడ్జి—మీరల్లా ఎప్పుడూ అనుకోవద్దు. ఎంత నమ్మకం లేక పోతే నేను మీ దగ్గరకు వస్తాను? అసలు యిబ్బంది ఆ కుర్రవాడిపేరు నాకూ తెలియదు.

స్వామి—మీ కాగితాల్లో లేదూ?

జడ్జి—లేదు. నిజంగానే... నన్ను నమ్మండి. నాకు తెలియదు. సరే... మరి నేను డబ్బు తీసుకువస్తాను. రెండు వందల్లు

కదూ, నిజంగా రెండువందలు అడిగాడా? రెండువందల్నా యివ్వవలసిందేనంటారా?

స్వామి—అహా! ఇవ్వవలసిందే మరి బోలెడు ఆస్థి కల్సివస్తున్నప్పుడు ఆ మాత్రం ఖర్చుపెట్టక తప్పదు.

జడ్జి—ఏమిటో! వెధవగోల! ఇటువంటి వాటిల్లో ఎప్పుడూ తిరగలేముగదా? (పైకివెళ్ళి డబ్బుతెచ్చి) పదండి.

స్వామి—మీరు వస్తారా?

జడ్జి—ఆ వస్తా.

స్వామి—నేను రానన్నారు, ఇందాకా...

జడ్జి—నే నివతలే వుంటాన్లెండి.

స్వామి—అల్లా ఎందుకూ? నే వెళ్ళి యిచ్చి వస్తాగా?

జడ్జి—నేనిక్కడుండి...ఏం చేస్తాను, పదండి.

స్వామి—దీన్లోనూ నన్ను నమ్మరన్నమాట. సరే పదండి.

జడ్జి—అబ్బే! మీరల్లా అనుకోవద్దు.

[ఇద్దరూ బయటకు వెళతారు. వాళ్లు వెళ్ళినతర్వాత సుకుమార్ బయటకు రాబోయి ఎవరో రావటంచూసి, ఆగి వెళ్ళి మళ్ళీ దాక్కుంటాడు. కొత్తవాడు వస్తాడు. ఎవరూ లేకపోవటం చూసి అనుమానిస్తూ ఆలోచిస్తూండగా సుకుమార్ Photo తియ్యబోతాడు. అది చూసి వెంటనే]

కొత్త—ఆ...ఆ...[ఖంగారుపడ్తాడు].

సుకు—కదలకు పోజు బాగుంది.

కొత్త—తియ్యకండి.

(చేతులు మొహానికడ్డంపెట్టుకుంటాడు)

సుకు—ఏం?

కొత్త—నాకు ఫొటో బాగుండదు.

సుకు—పరాయి యింట్లోకొచ్చి పరీక్ష చేయటం బాగుందా?

కొత్త—మీనాన్నగారు రమ్మంటేనే వచ్చాను.

సుకు—ఆ, ఏమంటావ్! నువ్వు శేఖర్ కోసం రాలే?

కొత్త—లేదు. ఇందాక వూరికేనే అట్లా అన్నా; మీనాన్న గారికోసం వచ్చా. రమ్మని కబురెట్టారు.

[విశాల, శేఖర్ బయటనించి వస్తారు]

శేఖ—(రాంగానే) ఎందుకొచ్చావురా ఇక్కడికి? (కొట్ట బోగా)

కొత్త.—ఆ, ఇకరాను శేఖర్.

సుకు—ఆగు...వాడు...నాకోసం వచ్చాడు.

శేఖ—వీడితో మీకేం పని?

సుకు—ఒక దొంగపని,

శేఖర్—ఆ.

సుకు—దొంగతనం చేయించాలి.

విశా—ఎవరింట్లో

సుకు—మా యింట్లోనే

విశా—మీ యింట్లోనా!

సుకు—ఆ, మాయింట్లో! ఒక ముద్దుబుగ్గల సుందరాంగి వుంది. ఆమెను దొంగతనంగా.

విశా—ఆమెను దొంగతనం చేయిస్తావా? కర్మించాలక నన్ను కానుగదా ?

శేఖ—వేళాకోళానికేం లెండి. ముందు వీణ్ని చితక పొడుస్తాను.

సుకు—ఆగు శేఖర్ !

శేఖ—మీరడ్డం రాకండి, బాబూ! నాన్నగారికి తెలిస్తే నన్ను బ్రతకనివ్వడు.

సుకు—ఒరే, నువ్వు పోరా

కొత్త—అలాగేనండి, (కొత్తవాడు వెళతాడు)

విశా—వాడెవడండీ ?

శేఖ—దొంగండీ ! బందిపోటు దొంగ !

విశా—మామూలుగానే వున్నాడే ! ఏం చేసాడు!

సుకు—మానాన్న జేబు లూటీ ! వీపు తపామర్చా !

విశా—నీమాటలుచూస్తే నవ్వొస్తుంది. అర్థం కనిపించదు. నువ్వు తెలివిగలవాడివో, చవటవో తేల్చుకోలేకుండా వున్నాను.

సుకు—అల్లా వున్నాయి నీ తెలివితేటలు.

విశా—కాస్త 'సీల' వొదులనిపిస్తుంది. ఏదైనా మా నాన్న నిన్ను పెళ్ళిచేసుకుంటే బాగుంటుందంటాడు.

సుకు—కాస్త 'సీల' ఒదులు చెయ్యి. అప్పుడనకుండా వుంటాడు.

విశా—'సీల' ఇదివరకే ఒదులైనట్టుంది, బోలెడు ఆస్తి వస్తుంది, కనక ఈ పెళ్ళి చేసుకోమంటాడు. ఆ స్త్రీకి నన్నింత కాంక్ష అమాంతం ఎలా పుట్టిందో

శేఖ—మనసులో అదివరకు లేంది, అమాంతం ఏదీ పుట్టన్ను

విశా—అదివరకు ఏం వుందో గాని ఈపెళ్ళిగోల మాత్రం అదివరకులేదు. ఈ పెళ్ళికొప్పుకుంటే సుఖపడతానట. ఏం సుకుమార్, నిన్ను పెళ్ళిచేసుకుంటే నిజంగా సుఖ పడతానంటావా ?

సుకు—ఆ! నేను సుఖపడనిస్తే!

విశా—నన్ను సుఖపడనివ్వవాఏం ఖర్మం?

సుకు—నాచేతనైనంతవరకూ, ఉహూ!...

విశా—నాచేతనైనంతవరకూ ఎవరినన్నా పెళ్ళాడుతాగాని, నిన్ను మాత్రం, ఉహూ...

సుకు—ఎవర్నన్నా ఎందుకు ? ఈ శేఖర్ని చేసుకో.

విశా—శేఖర్నా !

సుకు—లేకపోతే మానాన్ననా ?

విశా—ఏం శేఖర్! నిన్ను చేసుకుంటే, నువ్వు సుఖపడి నన్ను సుఖపెట్టగలవా ?

సుకు—కొంతవరకూ ఆ మాటనిజం.

విశా—ఎంతవరకూ?

సుకు—సహాంవరకూ; నిన్నతడు సుఖపెట్టగలడుగాని నువ్వు తని ఎముకల కొరుక్కుతింటావ్.

విశా—ఏమోనబ్బా! డబ్బును చూసి సుఖపడేవాణ్ణి నే నింతవరకూ చూడలేదు.

సుకు—నువ్వుచూశావా శేఖర్?

శేఖ—నేనింతవరకూ, ఏంచూసుకుని సుఖపడ్డవాణ్ణీ చూడ లేదు.

సుకు—ఆ! అందుకనే Photo లు తీసిచూస్తూ Photo లు

విశా—మరి నా ఫొటో నాకు చూపించలేదేం?

సుకు—Enlarge చేసినతర్వాత చూపిద్దామనుకున్నా. తెచ్చి చూపిస్తా నాగు, ఇప్పుడే. (వెళ్తాడు)

విశా—ఇది ఏ రకం పిచ్చోగాని, మద పిచ్చి మాత్రం కాదు.

శేఖ—ఏమో! ఏదీ మా కెవ్వరికీ అర్థంకాలేదు. మొదట్లో దర్జాగానే వుండేవాడు. చదువు మానిపించి యింట్లో వుంచిన తర్వాతకూడా ఏంలేదు. ఒకరోజు తండ్రితోపాటు అడవిలో Camp కి వెళ్ళాడు. ఆ రాత్రి అక్కడే వుండి తిరిగివచ్చాడు. అంతే. అప్పట్నించీఫొటోలు తీస్తానంటూ బయలుదేరాడు.

విశాల—అక్కడేమయిందో!

శేఖ—ఏమో!

విశా—సరే! మరి యివ్వాళ లోయల్లోకి వెళ్దామా! అసలు చూడాల్సిన ప్రదేశమే అది.

శేఖ—వెళ్దాం. సాయంత్రం స్వామినాథంగారి దగ్గర తుపాకీ తీసుకు వెళ్దాం.

విశా—తుపాకీయా! ఎందుకు?

శేఖ—అక్కడ దొంగలు పగటి పూట నిద్రపోతారని ప్రతీతి.

విశా—నిద్రపోతారా! అలసిపోతారు కాబోలు. రాత్రి దోపిడి చేస్తారు కాదూ.

శేఖ—మరే! మరి వాళ్ళూ మనుష్యులేగా! వాళ్ళూ అలసి పోతారు.

విశా—వాళ్ళనీ మనుష్యు లంటావా? పరాయివాళ్ళని ఏడ్పించి బాధించి వాళ్ళసొమ్ములు లాగే వాళ్ళు జంతువులు కాకపోతే రాక్షసు లౌతారు. అంతే.

శేఖ—ఆ లెక్కన చూస్తే మనం అందరం రాక్షసులమే.

విశా—అదేమిటి?

శేఖ—మన పొట్టకోసం మన మొందరిని బాధిస్తున్నాం. ఈ స్వామినాథంగారి కొలువులోచేరి ఎంతమంది బాకీ పడ్డ వాళ్ళ పుస్తెలు తెంపు కొచ్చానో, యీ చేతుల్తో!

విశా—నీ ఉద్యోగ ధర్మం నువ్వు చేస్తున్నావ్. దాన్లో నీ బాధ్యతేముంది?

శేఖ—నేనూ జంతువునైతే నాకూ బాధలేదుకాని నేను మనిషిని ఒకర్ని బాధించకుండా నేను సుఖపడాలని నా కోరిక.

విశా—ఓ...ఆ మాట నిజమేనేమో! కాని......

శేఖ—కాని ఈ ప్రపంచంలో సాధ్యం కావటం లేదు. ఈ "కాని" అనే మాట మన్ని రాజీకి దింపి దుంప తెంపు తుంది. ఒకడు నా ఆస్తిని కాజేశాడు. కోర్టుకు ఎక్కాను. ఓడిపోయాను. దరిద్రంలో ఆరునెలలు కడుపు

మాడ్చుకున్నాను. కాని ఎన్నాళ్ళని ఆకలితో బాధ పడను. ఆకలిమంట అనేకమైన నీచకార్యాలు చేయించింది. చివరకి నామనస్సునూ నా బలాన్ని చంపుకుని యీ వుద్యోగంలో కుదిరాను. నా బలాన్ని కొనుక్కుని స్వామినాథంగారు ఆర్జించుకుంటున్నారు. నేను కాపలా లేకపోతే ఈయన్ని ఎప్పుడో దొంగలు దోచుకునేవాళ్ళు. నా బలం నా కిచ్చేది ఆకల్ని ఆపే తిండి; కాని స్వామినాథం గారికో!...డబ్బు.

విశా—స్వామినాథం గార్ని దోచుకునేవాళ్ళా!

శేఖ—ఆ...కక్షగట్టి ఎన్నోసార్లు దోచుకునేవాళ్ళు.

విశా—ఆయన మీద అంత కక్ష ఎందుకు?

శేఖ—వాళ్ళ పొట్టలు కొట్టాడు గనక.

విశా—అదేమిటి?

శేఖ—ఏముంది? ఈయన రాకముందు ఈ అడివి అంతా వాళ్ళది; కట్టెలుకొట్టుకొని పొట్టపోసుకునేవాళ్ళు. ఈయన వచ్చి కంట్రాక్టుపాడి వాళ్ళనోళ్ళుకొట్టాడు. వూళ్ళోవున్న చెరువు వాళ్ళది. చెరువులో చేపలు ఎవరిక్కావల్సినవి వాళ్ళు పట్టుకుని తినేవాళ్ళు. ఈయన చెరువుపాట పెట్టారు. వూరిచుట్టూ బంజరుభూమివుంది. ఎవరికి కావల్సినంత వరకూ వాళ్ళు బాగుచేసుకుని పండించుకునేవాళ్ళు. ఈయన వచ్చి దాన్నంతా ఆక్రమించుకున్నాడు. అల్లాగే ప్రతి చోటా. వాళ్ళవృత్తులు పడగొట్టాడు. వృత్తిపడగొట్టట

మేమిటి? యిప్పుడూ పనిచేసేదివాళ్ళే. చేపలుపట్టేదీ వాళ్ళే, బంజరు సాగుచేసేదివాళ్ళే, కాని సాగుచేసి యీాయనకి భాగంపెట్టాలి. వాళ్ళు కష్టపడి ఈయనకు ఫలితాన్నివ్వాలి. ఇదివరకున్న దెంతో యిప్పుడూ వున్న దంతే, ఈయనకి సగభాగం యిస్తే వూళ్ళోవాళ్ళకి మిగిలేది సహామే, ఈసహాం తిండితో చాలామంది కూలివాళ్ళైపోయి మెదలకుండా పడివున్నారు. సహాం తిండి కూడా దొరకనివాళ్ళు దొంగలయ్యారు.

విశా—అయితే వాళ్లను దొంగల్ని చేసింది ఈయనే నంటావా?

శేఖ—అంతేకాదు, దొంగతనం చేయిస్తున్నదీ యీాయనే.

విశా—అదేమిటి?

శేఖ—దొంగలచేతికి ఏదిదొరికితే అదే దొంగిలిస్తారు. వాళ్లకి ధాన్యందొరికితే తింటారు. ధనందొరికితే కొనుక్కుంటారు. కాని నగలుదొరికితే ఏమిచేసుకుంటారూ? నగలు, నాణ్యాలు కావాలంటే వీరిదగ్గరకు రావాల్సిందే, దొంగసొమ్ము ఈయకొనేవాడు. ఈయన కొనకపోతే వాళ్ళ దొంగతనం సాగదు. ఆ కొనటంలోకూడా అన్యాయం చేసేవాడు. అన్యాయాన్ని ఆట్టేకాలం భరించలేక వాళ్లు ఈయన్నే దోచుకోవటం మొదలెట్టారు. వాళ్ళని దోచుకోనివ్వకుండా, నేను అడ్డం, నా పొట్టకోసం.

విశా—అంత ఇష్టంలేనిపని ఎందుకుచేస్తున్నావ్?

శేఖ — ఏవుద్యోగమైనా ఇంతేగా ? ఈప్రాంతంలోవారు అందరూ దొంగలు, దొంగలు కాకపోతే స్వామినాథంగారి కూలీవాళ్ళు, ఈకూలీపనికి ముందు నేనూ దొంగనే.

విశా — నువ్వా ?

శేఖ — ఆ ! ఈచేతుల్తో అనేక దొంగతనాలు చేశాను. అనేక మందిని హింసించాను. అనేకమంది ఉసురుపోసుకున్నాను. కారణమేమిటి? మీరు కారణమడగరు. కారణాలు ఆలోచించి, సవరిస్తే ఈ ప్రపంచం యిలా వుండదు.

విశా — కారణమేమిటేమిటీ ?

శేఖ — కారణం నన్నొకడు ముంచివేశాడు గనక.

విశా — ఎవరది ?

శేఖ — నన్ను ముంచినవాడు చాలా పెద్దవాడే లెండి. "న్యాయాన్యాయాలను సరిదిద్దేవాడు". అప్పట్నించీ నాకు న్యాయం మీద నమ్మకంపోయింది. న్యాయంగా బ్రతక లేకపోతే అన్యాయంగా బ్రతకాలిగా మరి.

విశా — నువ్వు చెప్పేది కొంతవరకూ అర్థమవుతూంది. కాని ఇది ప్రపంచపునైజమేమో? పెద్దచేప ఎప్పుడూచిన్న చేపను తింటుంది.

శేఖ — అది పొట్టకోసం తింటుంది. కాని ఇదీ అదేనా? మనం జంతువులమే అనుకున్నా, జంతువులు ఈపనులు చేస్తున్నాయా! దొంగతనాలు చేయిస్తున్నాయా? అన్యాయంగా ప్రక్కవాళ్ళని నిలువునా ముంచుతున్నాయా? దొంగలు దోచుకుంటే అవతల పోలీసులున్నారు. కోర్టు

లున్నాయ్, కాని యీదోపిడీ నాపటానికేముంది?

విశా—నీగుండెల్లో అగ్నిపర్వతం ఏదో రగుల్తున్నట్టుంది.

శేఖ—ఆ పర్వతం రగిలినా బ్రద్దలవదులెండీ,

విశా—నువ్వు చెప్పిందంతా నాకు నచ్చింది శేఖర్, నువ్వనే దంతా నిజమే.

సుకు—(ఫొటోతోవచ్చి) ఇదిగో మీఫొటో.

విశా—ఇదేమిటి! మాయిద్దర్నీ కలిపి ఎప్పుడు ఫొటోతీశావ్?

సుకు—ఇందాక మీరిద్దరూ తోటలో కూర్చున్నప్పుడు యిక్కణ్ణించి తీశాను. (కిటికీ చూపిస్తాడు) ఎన్‌లార్జి చేశాను.

విశాల—చాలా బాగుందే! నీ మెదడు మామూలుగా పని చెయ్యకపోయినా, కెమెరా వెనుక బాగా పనిచేస్తుంది.

సుకు—నువ్వు తెలివి తక్కువదాన వనుకున్నాను, పొరపాటే!

విశా—తెలివిగల దాన్నంటావా ఏం?

సుకు—ఆ! చూడగా చూడగా పెళ్ళిచేసుకోవాలని కూడా బుద్ధిపుడుతోంది.

విశా—చంపావ్. ఆ పనిమాత్రం చెయ్యకు.

సుకు—ఆ పనిచేస్తే వేరే చంపటమెందుకూ?(బయట కారు హారన్ వినిపిస్తుంది.)

విశా—అదిగో! మా నాన్నగారూ, వాళ్ళూ వస్తున్నట్టు న్నారు రండి. తోటలోకి పోదాం. వాళ్ళంటే నా కసహ్యంగా వుంది.

సుకు— అయితే ఇంకేం? త్వరగానే పిచ్చెక్కుతుంది.

విశ్వా—పద; తోటలో నాకో ఫొటో తీద్దువుగాని, రా శేఖర్

[ముగ్గురూ వెళ్తారు. స్వామినాథం, జడ్జి వస్తారు]

స్వామి—(నవ్వుతూ) ముత్తానికి మీరు చాలా అసాధ్యులే.

జడ్జి—అనుభవం లేదు కాని, పదిరకాల కేసులు చూస్తూ వుంటాగదండి.

స్వామి—అబ్బో! మా కంణాన్ని పడగొట్టినవాళ్ళని మిమ్మల్నొక్కళ్ళని చూశాను. ఇంకెందుకూ? గవర్నమెంటు ఆఫీసులో తెల్సిన వాళ్ళున్నారుగా—దీనిప్రక్క చెరువుందే, దాన్ని కూడా కలిపేయండి; పనిలోపని అంతా వక్కసారే అయిపోతుంది.

జడ్జి—ఇదొకటి చేతిలోకి రానివ్వండి ముందు.

స్వామి—ఇంకా అదిరాకేం చేస్తుందండీ! అంతా యింత దిగ్విజయంగా జరిగిపోతుంటే!

జడ్జి—ఆ చెరువు కలుపుకుంటే మనకు వచ్చే లాభంఏమిటి?

స్వామి—అట్లా అంటారేమిటండీ! అరవై ఎకరాలచెరువు! మన పొలానికి నీరు అంతా దాన్నుంచేగా! అది మన చేతిలో లేకపోతే ఎల్లా! అంతే కాదు. ఆ చెరువులో చేపలవల్ల ఎంత ఆదాయం వుంటుందని మీ అభిప్రాయం

జడ్జి—చేపలమీదా?

స్వామి—ఎంత లేదన్నా నాలుగైదు వేలుంటుంది. ఒకలారీ పెట్టి మీరు పట్నం రావాణాచేస్తే ఈ ఆదాయం పది వేల దాకా పెరుగుతుంది.

జడ్జి—ఆ సంగతి నే నాలోచించలేదు. కాని యిప్పుడు ఆ చేపలపట్టుకొని పదిమంది బ్రతుకుతున్నారుకదా!-మరి వాళ్ళు వదిలేస్తారా ?

స్వామి—వాళ్ళదేముందండి? 'హుష్' అంటే ఎగిరిపోతారు. ఎగిరి పోవటమంటే ఎక్కడికి పోతారు లెండి ? మన కిందే జీతానికి పడి ఏడుస్తూ ఉంటారు.

జడ్జి—దాన్నాక్రమించుకోవాలంటే మళ్ళీ తాసిల్దారుకు లంచం పెట్టాలంటారా ఏం ?

స్వామి—అవసరమైతే పెట్టాలి. రెండువేలు ఖర్చుపెడితే ఏం? బోలెడంత లాభం వస్తుంటే !

జడ్జి—సరే కానివ్వండి చూద్దాం. (దొడ్లో విశాల పాట విన్పిస్తుంది. పాట వింటూ కిటికీ దగ్గరకు వెడతాడు. తోట లోకి చూసి) ఆ ! ఏమిటది !

స్వామి—ఏముంది...ఏముందేం అక్కడ ! (తనూ వెళ్తాడు చూట్టానికి. జడ్జీ చిన్నబుచ్చుకొని వెనక్కి తిరిగి) మా వాడు వాళ్ళిద్దరికీ ఫొటోలు తీస్తున్నాడేమిటి ?

(జడ్జి కోపంగా జేబులోంచి రివాల్వర్ తీసి పేల్చబోతాడు; స్వామినాథం అతనికి అడ్డంపోతూ)

స్వామి—ఆగండి

జడ్జి—పొట్టకోసం చేరిన వెధవ, ప్రక్కన జేరి ఫోటోలు తీయించుకుంటాడా ?

స్వామి—తొందరపడకండి; గురితప్పితే కష్టం. (రివాల్వర్ని లాగేస్తాడు)

జడ్జి—బుర్రలేక అతను ఫోటో తీస్తున్నాడు. బుర్రవుండీ సిగ్గు లేకుండా, యిది ఫొటో తీయించుకుంటోంది? ఇంతకూ ఆ శేఖరెవడు? ఎవడైనా వాడు సర్వెంటుగా మాత్రం వుంటాడ్లే, ఈ యింట్లో. పిలవండి ముగ్గుర్నీ, చీవాట్లు పెడదాం.

స్వామి—తొందరపడకండి.

జడ్జి—మీరాగండి, పిలుస్తాను. (కిటికీలోంచి) అమ్మాయ్! అమ్మాయ్!

(వస్తున్నా 'నాన్నా' అని దూరంగా విశాల కంఠస్వరం)

జడ్జి—ఒకసారి పైకిరా, (అని వెనక్కి వచ్చి) మనం మధ్యాహ్నం మాట్లాడుదాం, తక్కిన విషయాలు.

[జడ్జి వెడతాడు, విశాల లోపలికొచ్చి పైకి వెళ్ళిపోతుంది. స్వామినాథం ఆలోచిస్తూవుంటాడు. కిటికీ గడియ డానంతట అదే లేచింది. తలుపు తెరుచుకుంది. దొంగ లోపలికి వచ్చాడు.

స్వామి—నువ్వా!

కొత్త—నేనే! వాకిలివైపు శేఖరుంటేనూ యిటువచ్చేశాను.

స్వామి—నీకోసం రెండుసార్లు కబురుచేశాను. చూడూ నీకో పనుంది, నీపనేలే. (నవ్వుతాడు)

కొత్త—అహా, ఎక్కడా? ఎవరియింట్లో?

స్వామి—మన యింట్లోనే...

కొత—మనింటోనా?

స్వామి—ఆ! రాత్రికి నేనింట్లో వుండను. రాత్రికి అందర్నీ కేకేసుకురా. పైగదిలో చుట్టాలొచ్చివున్నారు. ఒకపిల్ల, ముసలాయన!...డబ్బు చాలావుంది. డబ్బూ, ఆపిల్లదగ్గర నగలూ కానిచ్చెయ్యండి. జాగ్రత్త! ఏదో మిమమీాద నేనూ అబ్బాయి, శేఖరూ సాయంకాలం వెళ్ళిపోతాం. అమ్మాయి, ఆయనా, వక ముసలినౌకరూ యింట్లో వుంటారు. అంతే ఆ. వారి దగ్గర పిస్తోలుంది, దాన్ని నేనెల్లాగన్నా తీసుకుపోతాలే. తర్వాత డ్రాయర్‌లో కొన్ని ముఖ్యమైన కాగితాలున్నాయి. అవ్వికూడా నువ్వు కాజేసి నాకు అడవిలోకి తెచ్చియియ్యి. తెలిసిందా! ఇదిగో, తాళంచెవ్వి ఈ డ్రాయర్‌ది, ఇంద. (తాళంచెవ్వి యిస్తాడు)

కొత్త—(ఉలిక్కిపడి వెనక్కితిరిగి) ఆగండి

స్వామి—ఏం?

కొత్త—ఆబ్బాయిగారు! అబ్బాయిగరు! ఇక్కడే ఎక్కడో వున్నారు.

(అటూ యిటూ చూస్తాడు)

స్వామి—ఛా లేదులే.

కొత్త—కాదండి! ఇప్పుడు మన ఫోటో తీశారు. "క్లిక్" అని వినిపించిందే.

స్వామి—(వెళ్ళి వకసారి అటూయిటూ చూసివచ్చి) ఏం విన్నావో ఎవ్వరూ లేరు.

కొత్త—కాదండి! నాఫోటో బయటపడితే ఇంకేమన్నా వుందా! పోలీసులు పోల్చేస్తారు.

స్వామి—ఫర్వాలేదు ఫోటో పడ్డా ఆఫోటో ఇల్లు దాటి పోదుగా.
కొత్త—సరే! నేనస్తా; రాత్రికి అంతా తయారు కావాలిగా.
స్వామి—ఆ.

[కొత్తవాడు వెళ్తాడు కొంచెంసేపటికి సుకుమార్ లోపల్నించి హుషారుగా వస్తూ]

సుకు—ఫొటోతీశా! వన్ డర్ ఫుల్ (Wonderful) ఫొటో వన్ డర్ ఫుల్.
స్వామి—ఒరేయ్! ఏంపనులురా యివ్వి!
సుకు—ఫోటోలు! ఫొటోలు!
స్వామి—ఎందుకురా యివ్వి?
సుకు—అదంతా కేవలం స్వవిషయం! నీకెందుకు?
స్వామి—నాకెందుకంటా వేమిట్రా, ఆ శేఖర్ని, విశాల్ని కలిపి ఫొటోతీశా వెందుకు, ఆ శేఖరెవరని నీవుద్దేశ్యం?
సుకు—మనిషే లే.
స్వామి—విశాలా?
సుకు—మనిషేగా.
స్వామి—నీ మొహం!
సుకు—నా మొహమే.
స్వామి—విశాల గొప్పయింటి బిడ్డ; శేఖరుగాడు. వుత్త...
సుకు—పేదయింటి బిడ్డ.
స్వామి—వీళ్ళిద్దర్నీ ఫొటోల్లో చూస్తే, ఏమంటా రెవరన్నా?
సుకు—భార్య భర్తలంటారు.

స్వామి—ఛ, వాళ్ళిద్దరూ భార్యాభర్తలేమిటి! ఆమెకీ వ్వాడికి సాపత్యమెక్కడ?

సుకు—ఇక్కడిదే.

స్వామి—ఛీ, ఛీ, మొదట వారిదగ్గరకూడా పంపవద్దనీ, ఈ శేఖరిప్పుడు అంటకాగి వుంటున్నాడు. వెధవ. ఇక వాణ్ణి క్కడ వుండనివ్వగూడదు. నువ్వు ఫొటోలు తియ్యడం చూసి జడ్జీగారేమన్నారో తెలుసా?

సుకు—తనకీ ఒక కాపీ కావాలన్నారా?

స్వామి—పిస్తోలుతో పేల్చేస్తానన్నాడు.

సుకు—ఆయనదగ్గరున్నది పిస్తోలుకాదులే! రివాల్వర్.

స్వామి—రివాల్వరా, (ఆలోచించి) ఆ! రివాల్వరేనా!

సుకు—ఆ రెండింటికీ భేదం నీకు తెలియదులే.

స్వామి—నీకు తెల్సా! వెధవా! పిచ్చి వెధవ్వి కాదు... మంచి వెధవ్వి కాదు.

సుకు—పిచ్చిలో మంచి వెధవని.

స్వామి—అందుకే విశాల నిన్ను దగ్గరకు రానివ్వటంలేదు.

సుకు—అదృష్టం! శేఖరంటే వెళ్తుంది.

స్వామి—ఇక ఇటువంటి పనులు ఎప్పుడూ చెయ్యకు... (జడ్జివస్తాడు) రండి; మీ కోసమే రావాలనుకుంటున్నాను. ఇప్పుడే కబురొచ్చింది. అడవి గుమాస్తా నన్ను అర్జంటుగా రమ్మని కబురెట్టాడు.

జడ్జి—ఏం?

స్వామి—ఏమో! ఏం కూలిపోయిందో! "చాలా అర్జంటు

వ్యవహారం; సాయంకాలానికల్లా రావాలని'' కబురు వచ్చింది.

జడ్జి—అహా...

స్వామి—మరి నేనూ, శేఖర్, అబ్బాయీ వెళ్తాం. మళ్ళా తెల్లవారంగనే వొచ్చేస్తాంలెండి.

జడ్జి—మరి మేమూ?

స్వామి—మీ కన్ని ఏర్పాట్లు చేసే వెళ్తానుగా! అన్ని ఏర్పాట్లు అయిపోతున్నాయ్ కూడా. ఇదిగో...ఆ... డ్రాయరు తాళంచెవ్వి. దాంట్లో మీ కాగితాలున్నాయి కాదూ! మీ దగ్గరే వుంచుకోండి తాళం చెవ్విగూడా.

జడ్జి—అక్కర్లేదు ఉంచండి. ఎక్కడవుంటే ఏం.

స్వామి—అల్లాకాదు. నేను కొంచెం కరెక్టు మనిషిని...ఆ... మర్చిపోయా! రాత్రికి ప్రయాణం కాదూ! నా తుపాకీ అర్డర్‌లో లేదు. మీ దగ్గరున్న రివాల్వర్ మాకివ్వాలి.

జడ్జి—రివాల్వ రివ్వనా!

స్వామి—ఫర్వాలేదు. జాగ్రత్తగా వుంచుతాను. అవసర మైతేగాని వాడను లెండి.

జడ్జి—కాని మీరందరూ వెళ్ళిపోతే, వంటరిగా దగ్గర రివా ల్వర్ కూడా లేకుండా యిక్కడా!......

స్వామి—ఫర్వాలేదు. మనింట్లో వుంటే, ఠాణాలో వున్నట్టే. మా శేఖర్ దగ్గర తుపాకీ వుండనేవుంది.

జడ్జి—సరే! అలాగే తీసుకెళ్ళండి.

స్వామి—ఆ సుకుమార్! ఒక్కసారి శేఖర్ని కూడా కేక వెయ్యి.

సుకు—అక్కడ్నే. విశాలపైకి ఇందాక వెళ్ళిందిగా! అతనం తట అతనే వస్తాడిక్కడికి. కాసేపాగు.

స్వామి—ఏడిశావులే వెధవా! ఫో. పిలు.

సుకు—ఏమంటావ్ ? అవతల పెద్దమనిషుంటే...'వెధవా' అనేస్తున్నావే!

స్వామి—ఆ. ఆ. సరేలేరా...సరే...ఆగు.

[శేఖరు వస్తాడు]

సుకు—అదిగో చెప్పానుగా "వస్తాడని" వచ్చాడు.

స్వామి—శేఖర్! మనం త్వరగా అడవిలోకి వెళ్ళాలి. కావల్సిన వేమిటో సర్దు ఫో.

శేఖ—కాని...కాని...నేను రాలేనండీ...

స్వామి—ఏం ?

శేఖ—నాకు జ్వరం తగిలింది.

స్వామి—జ్వరమా! ఎప్పుడు తగిలిందీ!

శేఖ—ఇప్పుడే.

స్వామి—ఫర్వాలేదులే! తగ్గిపోతుంది. కానీ బయలుదేరు.

శేఖ—రాలేనండీ; నాకు బాగాలేదు. తల నొప్పిగావుంది.

స్వామి—రాలేనంటే ఎట్లా ?

జడ్జి—మీ కంతగా మనిషి కావాలంటే మావాణ్ణి తీసుకెళ్ళండి. మా ముసలయ్యను.

స్వామి—మీవాడు మాతో ఎందుకు? ఏడవను.

జడ్జి—ఇతను జ్వరంతోవచ్చి ఏం ఏడుస్తాడులెండి.

స్వామి—వాడుంటేనే ఎంతో ధైర్యమండీ.

జడ్జి—ఆధైర్యం మాకూ కావల్సిందేగా!

స్వామి—సరే!(మనసును సమాధానపరచుకుంటూ) జ్వరంలో ఇతనేం చేస్తాడూ! సరేలెండి. మీవాణ్ణి తీసుకెళతాను. మరి మీ రివాల్వర్...

జడ్జి—పైన పెట్టి వచ్చాను. తెచ్చి యిస్తా. (మేడ మీదకు వెళ్తాడు)

స్వామి—(శేఖర్ వంక చూసి) శేఖర్! తలనొప్పిగావుందా? (పట్టుకు చూసి) జ్వరం బాగా పేలిపోతోందే! (జేబు లోంచి వక సీసాతీసి దాంట్లోంచి రెండు మాత్రలు తీసి పొట్లంకట్టిస్తూ) ఈ మాత్రలు రెండూ రాత్రికి వేసుకో. తలనొప్పి జ్వరం తగ్గి బాగా నిద్రపడ్తుంది. ఇప్పుడే అక్కర్లే! రాత్రిపడుకోపోయేటప్పుడు వేసుకో... బాగుం టుంది.

శేఖ—అల్లాగే (అనిమూల గుడ్డకప్పుకొని పడుకుంటాడు)

స్వామి—సుకుమార్...టైం అట్టేలేదు. పోదాం పద.

సుకు—ఓ! అల్లాగే!

(అనియింట్లోకి వెళ్తాడు. జడ్జిగారు రివాల్వర్ తీసుకుని మేడదిగి వస్తూ)

జడ్జి—ఇదిగో రివాల్వరు...ముసలయ్యనుకూడా బయలుదేర మన్నాను.

స్వామి—సరే లెండి! ఇల్లుమాత్రం జాగ్రత్త.

జడ్జి—అల్లాగేలెండి; మే మేమీ మీయింటికెత్తుకుపోము.

(ఇద్దరు నవ్వుతారు...జడ్జీగారు మేడమీదకూ స్వామి నాథం బయటకూ వెళ్తారు)

—:తెర:—

## మూడవ రంగము

[అదేరాత్రి పన్నెండు గంటలతర్వాత శేఖర్ అల్లాగే ముసుగువేసుకుని పడుకొని ఉన్నాడు ... మేడమీదనుంచి విశాల దిగివస్తుంది]

విశా—శేఖర్ ! శేఖర్ !

శేఖ— ఆ,

విశా—ఎట్లా వుంది ?

శేఖ—అల్లాగే వుంది.........మీరు నిద్రపోలేయింకా ?

విశా—నిద్రపట్టటంలే.

శేఖ—పన్నెండుగంటలు కొట్టినట్టున్నారు.

విశా—ఆ. కొట్టారు ! నాన్నగారు నిద్రపోతున్నారు. మందేమన్నా వేసుకున్నావా ?

శేఖ—లేదు; అయ్యగారేవో మాత్రలిచ్చారు. అవ్వి వేసుకోలే.

విశా—వేసుకోలే ? వేసుకోకపోయావా ?

శేఖ—ఏం అక్కర లేదు. ఈ చుట్టుపక్కల ఈ జ్వరాలు మామూలేలెండి...వచ్చి కాసేపుండి...తగ్గిపోతాయి.

విశా—ఆహారంగూడా ఏంతీసుకోలేదల్లేవుంది. కాఫీఏమన్నా తాగుతావా ?

శేఖ—అక్కర్లే...

విశా—అహం ! తాగు. బొత్తిగా లంఖణం ఎందుకు ? తెచ్చి యివ్వనా...ఇప్పుడే వస్తానాగు. (వెళ్ళబోగా)

శేఖ—ఈ అర్ధరాత్రి పూట నాకు కాఫీ తెచ్చియిస్తారా ?
విశా—ఆ...ఇప్పుడే తెస్తానాగు.

[లోపలకు వెళుతుంది శేఖర్ మూలుగుతూ పడుకొని వుండగా కాస్సేపటికి జడ్జీగారొస్తారు]

జడ్జి—ఏమోయ్......నిన్నే......అమ్మాయేదీ ?
శేఖ—లోపలికి వెళ్ళారు.
జడ్జి—లోపలికా ?......లోపలికంటే...?
శేఖ—వంటింట్లోకి.
జడ్జి—వంటింట్లోకా ? దేనికి ?
శేఖ—కాఫీ కాచుకురావటానికి.
జడ్జి—ఉహూ,

[విశాల కాఫీతో వస్తుంది]

విశా—లే, శేఖర్ ! కాఫీ తాగు. శేఖర్ ! కాఫీ తాగు, లే.
(శేఖర్ లేవబోతూంటే)
జడ్జి—పాపం! పట్టుకోలేడేమో! లేవదీసి నీచేత్తోనే తాగించు
విశా—పట్టుకు తాగ్గలవా, నే తాగించనా.
శేఖ—అక్కర్లేదు లెండి, (తీసుకు తాగుతూవుంటాడు)
జడ్జి—ఊఁ! పన్నెండుగంటలైనా నిద్రపోకుండా అనాథసేవ చేస్తున్నావన్న మాట.
విశా—పాప మతను రాత్రి ఏంతీసుకోలేదు నాన్నా! పస్తు పడుకున్నాడు. చూడలేక.
జడ్జి—లోకంలో పస్తులుపడుకునేవాళ్ళు చాలామందున్నారు.

విశా—అల్లా అంటావేం నాన్నా!

జడ్జి—ఏం లేధూ నాకూతురు ఒక వెధవకి వుపచారం చేస్తుంటే నేను కళ్ళతో చూస్తాననుకో లేదు.

విశా—ఆ!

జడ్జి—పదిమంది తనకింద పనిపాటలు చేస్తుంటే అనుభవిస్తుందనుకున్నాగాని......

విశా—నాన్నా! ఇంతమాత్రానికే......

జడ్జి—చాల్లే! నడు లోపలికి. B. A దాకా చదివావు, ఆమాత్రం ప్రపంచజ్ఞానం ఉండనక్కర్లే. నిన్నేదో అంతఃపురాల్లో వుంచాలనీ నే చూస్తుంటే, మురిగ్గుంటలో ఘున గాలని నువ్వుచూస్తున్నావ్, వాడెవరూ, నువ్వెవరూ? వాడితో ఆ ఘాటేలేమిటి? ఆ సాంగత్యాలేమిటి? ఇప్పుడీ కాఫీలేమిటి?

శేఖ—నాకు కాఫీ యిచ్చినందుకేగదండి మీకింతకష్టం? మీ కంత కష్టంగా వుంటే తాగను లెండి.

విశా—శేఖర్!

శేఖ—ఫర్వాలేదులెండి. పస్తుండటం నాకలవాటే.

విశా—నోటిదగ్గర గ్లాసు తీసెయ్యకు శేఖర్.

శేఖ—నా నోటిదగ్గర తిండి తియ్యటం మీ నాన్నగారి కిది మొదటసారి కాదులెండి.

విశా—అదేమిటి?

శేఖ—నా ఆస్థి నా క్కాకుండాచేసి, నా జీవితాన్నెప్పుడో తుంపులుచేశారు. ఆయనకి కాఫీ ఒకలెక్కా?

8

విశా—ఏమిటిది? కలవరిస్తున్నావా, శేఖర్!

శేఖ—కలవరింపులుకాదు. నేనొకనాడు అనాధనైనా దొంగనైనా, కూలీనైనా, అంతకీ కారణం ఈ జడ్జీగారే, ఈ జడ్జీగారి తీర్పే.

జడ్జి—అలాగా!!

శేఖ—నా ఆస్తి కాజెయ్యటాని కావేళ నిజాన్ని కప్పిపుచ్చి తీర్పుచెప్పారు. నా ఆస్థి కాజెయ్యటానికే ఈవేళ ఈ వూరు వచ్చారు. ఆ స్తిపోయి అనాధనైన నాకీ కాస్సీలు లెక్కలేదు. తీసుకోండి అంతా (కాఫీగ్లాసు విసిరికొట్టి) ఈ రెక్కల్తో నా వక్క పొట్ట పోషించుకోగలను. బ్రతకటానికి.

జడ్జి—ఊ! కాస్త పెంకితనం తగ్గించి మాట్లాడు.

శేఖ—నే నెందుకు తగ్గించిమాట్లాడాలి? ఈ శేఖర్ సంగతి తెలియలేదల్లేవుంది. ప్రాణాలు దక్కించుకొని యిక్కణ్నించి బయటపడాలంటే, నీ ఆస్తీ, గౌరవం కాస్థయినా సాయంచెయ్యవు. ఒక్క శేఖరు రెక్కలే చివరికి గతి మీాకు.

జడ్జి—అట్టే వాక్క నోరుముయ్యి.

శేఖ—నాసంగతి బాగా అర్థమైనట్లు లేదా! జ్వరంతో పడుకున్నానని నిర్లక్ష్యంగా వుందా? శేఖర్ కండల్లో మూలుగుతూ వున్న సత్తువసంగతి యింకా తెలియదా? (జడ్జి కోపం భరించలేక దూరాన వున్న తుపాకీవంక ఓసారి చూచి గబగబాపోయి తుపాకీ అందుకోబోయాడు. కాని దాన్ని ముందు శేఖరే అందిపుచ్చుకుంటాడు)

జడ్జి—ఆ! పొరపాటున రివాల్వర్ పంపించేశాను.

శేఖ—రివాల్వర్ వుంటే పేల్చే వాడివా? పేల్చి ఈ ప్రాణాల్తో బైటకు పోగలిగే వాడివా? తల్చుకుంటే చిటికలో నిన్నూ నీ గర్వాన్ని నీళ్ళల్లో ముంచగలను. ఈ చుట్టు పక్కల నీకూ, నీ స్వామినాధానికీ దేముణ్ణని మర్చిపోకు.

జడ్జి—ఓః... తెల్లవారనీ, నీ సంగతి కనుక్కుంటా. ఇక లోపలకు రా విశాలా (మేడమీాదకు వెళ్ళబోతాడు)

శేఖ—తెల్లవారనీ! నీ లెక్కలు నీకే వప్పజెపుతా.

విశా—ఏమిటిది శేఖర్!

శేఖర్—నన్ను మాట్లాడించకండి. అసలే మతి సరిగ్గాలేదు. అబ్బా...(తల పట్టుకుంటాడు)

విశా—ఏం, తలనొప్పా?

శేఖ—ఆ, ఈ వాగడంతో మరీ ఎక్కువైంది. ఆగలేను. మాత్రలు వేసుకుని నిద్రన్నాపోతా.

విశా—ఈ మాత్రలు వేసుకుంటే నిద్రపడుతుందా?

శేఖ—నిద్రపడుతుం దన్నారు.

విశా—మత్తుమాత్రలా ఏం?

శేఖ—ఏమో! మత్తువస్తే వచ్చిందిలెండి. హాయిగా తెల్లవారిన తర్వాత లేవచ్చు. (మాత్రలు వేసుకుంటాడు)

జడ్జి—(లోపల్నించి) విశాలా! రమ్మని నీకాక్కాదూ చెప్పేది?

శేఖ—మీారు వెళ్ళండి, నేను పడుకుంటా? (పడుకుంటాడు)

విశాల—వస్తాను. (వెళుతుంది.)

[కాసేపు శేఖర్ పడుకుంటాడు కాని, లేస్తాడు, విసుక్కుంటాడు. తనలో తాను నీరసంగా "అమ్మా" అ -కుంటాడు. తిరిగి మరొక రెండు మాత్రలు వేసుకొని పడు కొంటాడు. గాలిదుమారం సూచనగా- పెనుగాలి వీచిన సవ్వడి బాగా వినిపిస్తుంది. కొత్తవాడు కిటికీ గడియ బయట నుంచి ఎత్తి లోనికి ప్రవేశిస్తాడు. గాలి చప్పుడు ఎక్కువౌ తుంది. శేఖర్ లేస్తాడు. దొంగనక్కి-దాక్కుంటాడు. శేఖర్ లేచి అంతా వక్కసారి తిరిగివచ్చి మరల పడుకుంటాడు. గాలి సవ్వడి సన్నగా వినిపిస్తూనే వుంటుంది. కాసేపయిన తర్వాత కొత్తవాడు అన్ని వైపులాచూసి శేఖర్ దగ్గరకు కూడా వచ్చిచూసి నుంచుని ఆలోచించి "అహ" అనుకొని టేబుల్ దగ్గరకెళ్ళి డ్రాయరు తీసి లోపలున్న నకలు తాగి తాలు తీసుకుంటాడు. కిటికీ తలుపు తీసి బ్యాటరీలైటు బయ టకువేసి రెండు మూడుసార్లు వెలిగించి అర్పగా కిటికీ దగ్గరకు మరొక దొంగవస్తాడు]

కొత్త—నే నటువైపు వెళ్ళి మేడ గది తలుపు తీస్తాను. మీరు తిరిగి రండి. అందరం మేడపైకి పోవాలి.

[మేడపైకి...అనిసౌంజ్ఞలచేసిచెప్తాడు. దొంగతలూపి వెళ్తాడు. కొత్తవాడు నెమ్మదిగా వెళ్ళి బయట తలుపు తెరు స్తాడు. దొంగ లందరూ ప్రవేశించి నిమ్మదిగా మేడమీద కెళ్తారు. మేడపైన "జడ్జీ విశాలా! దొంగలు దొంగల"ని కేకలు వేస్తారు. శేఖరు లేచి అటుచూసి "దొంగలా!"అను కుంటాడు. నిమ్మదిగా నవ్వుతాడు మేడపైని గలాటా జరుగు తూనే వుంటుంది.]

కొత్త—అరవకు అరిచావా గుడ్లు పీకేస్తాను.
దొంగ—ఆ పెట్టెలు చూడండి... వెతకండి.....తియ్యరా నగలు...డబ్బెక్కడుంది... చెప్పుముందు!
విశా—(వణుకుతూన్న స్వరంతో) దొంగలు... శేఖర్... శేఖర్ శేఖర్
శేఖ—(వాళ్ళను కొడుతున్నారనే భావంతో సంతోషిస్తూ శేఖర్ నవ్వుతాడు) దొంగలు! దొంగలు!
దొం—డబ్బెక్కడుందో చెప్పవేం చూస్తావేంరా... బాదు.
జడ్జి—అబ్బా.
విశా—బాబోయ్... శేఖర్... శేఖర్.
శేఖర్—(ఇంకా గట్టిగా నవ్వుతాడు) దొంగలు.
దొంగ—ఏం, చెప్తావా? చావగొట్టమన్నవా?
కొత్త—ఇదిగో డబ్బు...నగలు...(నవ్వులు).
దొంగ—నోటితో చెప్పకపోతే ఆగుతుందనుకున్నావ్.... (నవ్వు) వెతకండి...యింకా ఏమున్నాయో!
(విశాల కంఠస్వరం) శేఖర్ శేఖర్...(గాభరాగా కేకలు)
శేఖ—(ఇంకా గట్టిగా నవ్వుతాడు)
విశా—శేఖర్... శేఖర్......(మేడదిగివస్తుంది) దొంగలు శేఖర్...మానాన్నని, మానాన్నని,
శేఖ—(ఇంకా గట్టిగా నవ్వుతాడు) దొంగలు.
విశా—దోచుకుంటున్నారు శేఖర్!!...చావగొడుతున్నారు!
శేఖ—చావగొడుతున్నారు...చావగొడుతున్నారు (నవ్వు)

విశా—రా శేఖర్...గొంతు పిసుకుతున్నారు, శేఖర్ రావా శేఖర్ ?

శేఖ—రాను...రాను. చంపనీ...చావగొట్టనీ, నే రాను.

(నవ్వుతాడు)

విశా—రా శేఖర్...నా మొహంచూసి రా శేఖర్...!

శేఖ—మొహంచూసి రావాలా...మొహంచూసిరావాలా?

(వికృతంగా నవ్వుతాడు)

విశా—మా ప్రాణాలు కడబట్టుతుంటే అట్లా నవ్వుతావేం రా శేఖర్...తొందరగా రా.

శేఖ—అంతా అయిపోయివుంటుంది... అంతా సంపూర్తి చేస్తా. సంపూర్ణం చేస్తాను.

[పెద్దగా నవ్వుకుంటూ తుపాకీ తీసుకెళ్తాడు కాసేపటికి లోపల దెబ్బలాడిన శబ్దం...''శేఖర్ శేఖర్'' అని అరుపులు. శేఖరు నవ్వు. తుపాకీ పేల్చిన శబ్దం...వక్క శేఖర్ నవ్వుతప్ప అంతా క్రమంగా నిశ్శబ్దమయిపోతుంది. ఆ నవ్వు లోనే శేఖర్ తిరిగి వస్తాడు. వెనకనే విశాల వస్తుంది]

శేఖ—(నవ్వుతూనే) చూశావా! యిక్కడ మీ ప్రాణానికి దేముణ్ణయినా యముణ్ణయినా నేనే.

విశా—శేఖర్...

శేఖ—శేఖర్! శేఖర్! ఈ ప్రాంతానికి రాజూ...దొంగా ప్రాణం తీసేదీ...ఇచ్చేదికూడా (నవ్వు) ఈ శేఖరే..

విశా—ఏమిటానవ్వు ? ఏమన్నా వెర్రెక్కిందా ?

శేఖ—వెర్రికాదు. ఆనందం. అంత జడ్జీగారికి ప్రాణదానం

చేసిన ఆనందం. గర్భశత్రువుకు ప్రాణదానం చేసిన ఆనందం

విశా—నిజమే కాని ఇంతా!

శేఖ—అందులో నా ఆస్తి కాజెయ్యడానికి ఎప్పటినుంచో కాచుకున్కూచున్న వాడిని...నన్నింత చులకనగా చూసిన వాడిని రక్షించాను. నేనే పీల్చిచంపితే ఎవరు చంపా రంటారు?...దొంగలు చంపి పోయారంటారు...కాని కాని చంపలేదు. రక్షించాను...పొండి; నా పేరు చెప్పు కుని, నా ఆస్తి తిని...బ్రతకండి. (పెద్దగా నవ్వుతాడు దుఃఖంగామారి...అలిసి...ఆగి అబ్బా, అని తలపట్టుకుని బాధపడ్తాడు)

విశా—తలనొప్పా!

శేఖ—ఆ.

విశా—ఆ మాత్రలు వేసుకోలే?

శేఖ—వేసుకున్నా. వెధవమాత్రలు...నిద్రపట్టలేదు నొప్పీ తగ్గలేదు.

విశా—మాఅదృష్టం? దానితో మత్తువచ్చి నువ్వు పడు కుంటే మేము......అన్యాయమై పోయే వాళ్ళం.

['అబ్బ' అని మెడ తడుముకుంటూ జడ్జీగారొస్తారు]

విశా—మెడ నొప్పిగా వుందా నాన్నా?...

జడ్జి—ఆ... ఫర్వాలేదు......నన్నొదిలి యిక్కడ కొచ్చి కూర్చున్నా వేం?

విశాల—ఈ శేఖర్ పిచ్చిగా నవ్వుతుంటేనూ ఏమిటో చూద్దా మనీ వచ్చా...నాన్నా! ఆ ఆస్తి ఇతనిదేటగా...

జడ్జి—చెప్పాడుగా...అతనే!

విశా—అతనాస్తి అతనికిచ్చేద్దాం నాన్నా! మనది కాని దానికి మనకెందుకీ ఆశ. దొంగల చేతుల్లోంచి ప్రాణాలు రక్షించాడు...ఆ ఉపకారానికైనా మనం ఇచ్చేద్దాం.

జడ్జి—ఊఁ!

విశా—మనకున్నది మనకు చాలు. ఇంకెందుకు అత్యాశ?

జడ్జి—ఆగు—నాకూ ఇంకా మెదడుంది. నాఅంతట నేనూ ఆలోచించుకోగలను.

విశా—అయితే నువ్వే ఆలోచించు. మన సర్వనాశనాన్ని తప్పించాడు.

జడ్జి—ఏడిశాడులే.

విశా—నాన్నా! ఇంత జరిగినా నీకు.....

జడ్జి—ఎంత జరిగినా అంతే; ఆస్తి మనదే; అనుభవం మనదే. రేపటితో ఈ శేఖర్ పని ఆఖరు.

(మేడమెట్లువైపు వెళతాడు)

విశా—ఏమిటీ నువ్వనేది?

జడ్జి—అంతా చూస్తావుగా......తెల్లవారనీ...

అతి చురుగ్గా మెట్లెక్కిపోతాడు)

విశా—నాన్నా (అని చూస్తూ నిలబడిపోతుంది)

—: తెర :—

## నాల్గవ రంగము

[మటంనాటి ఉదయం. రంగంమీద ఎవ్వరూ లేరు. స్వామినాథం సుకుమార్‌ను చేత్తో పట్టుకుని లాక్కువస్తూ]

స్వామి—శేఖర్, శేఖర్, ఎక్కడున్నావ్ (శేఖర్ లోపల్నించి వస్తాడు) వీణ్ణి ఆ వెనకగదిలో పెట్టి తాళం పెట్టు.

శేఖ—ఏమయిందండీ?

(సుకుమార్ చెయ్యి వదిలించుకుని బుర్ బుఖ్ అంటూ పోబోతాడు)

స్వామి—ఆగరా! వెధవగోడవొచ్చిపడింది.

శేఖ—ఏమయిందండీ?

స్వామి—అర్ధాన్నమైంది. ఉన్నమతిగూడా పోయింది. తెల్లారేటప్పటికి "బుర్ బుఖ్" అంటూ తయారయాడు. ఫో, తీసుకుఫో, వీణ్ణి.

(శేఖర్ లాక్కుపోగా "బుర్, బుఖ్" అంటూ సుకుమార్ మొండికేసి కూర్చుంటాడు.)

శేఖ—రావడం లేదండీ.

స్వామి—నాలుగుకొట్టు వెధవని ... ... (లోపల్నించి జడ్జీ రావడం చూసి) ఆగు, వాణ్ణి ఒదిలెయ్యి, వెళ్లు, వెళ్ళి కారులోవున్న సామాను లోపల పెట్టు.

[శేఖర్ బయటకు వెళ్తాడు. పైనుంచి జడ్జీ దిగి వస్తాడు]

జడ్జీ—వచ్చారా స్వామినాథంగారూ! వచ్చారా! ముంప తెంపేశారు. వెళ్ళేవారు మమ్మల్నిద్దొంగలమధ్య వదిలేశి వెళ్ళారేం!

స్వామి—వచ్చానండీ! వచ్చా! అక్కడున్నంతసేపూ యిక్కడే మనస్సు. దొంగలంటారేమిటి? ఎవరన్నా వచ్చారేమిటి!

జడ్జి—రావడం! రావడమేమిటి? మీరు యింట్లో నేపెట్టి వెళ్తే? మీరు పెట్టి వెళ్ళినవాడు చాలడూ.

స్వామి—నే నింట్లో నే పెట్టానా? ఎవర్ని?

జడ్జి—మీా శేఖర్ని...

స్వామి—శేఖర్నా?

జడ్జి—ఆ (శేఖరు సామానుతీసుకుని లోపలికి వెళతాడు. అది చూసి యిద్దరూ మాట్లాడకుండా వూరుకుని శేఖర్ వెళ్ళిన తర్వాత)

జడ్జి—ఇంతవరకూ ప్రాణాలతో బ్రతికున్నామంటే అది మా అదృష్టంకొద్దీ కాని మరేం కాదు.

స్వామి—ఏమిజరిగిందేమిటండీ?

జడ్జి—దొమ్మీా, లూటీ. అమ్మాయి నగలూ, నాదగ్గరున్న డబ్బూ, అన్నీపోయాయి. అన్నీ దగ్గరుండి కొల్లగొట్టించాడు. (మేడమీాదనుంచి విశాల వస్తుంది.)

స్వామి—అరే! అత నటువంటివాడు కాదండీ.

జడ్జి—ఇంకా సందేహిస్తున్నారా? పదండి పోలీసులకు ముందు శేఖరుమీాద రిపోర్టు యిచ్చివద్దాం.

విశా—నాన్నా!!

జడ్జి—నువ్వూరుకో, పదండి, చూస్తారేం?

విశా—ఇంత అన్యాయమా?

జడ్జి—అన్యాయమేముంది? Circumstantial evidence motive కావాలా? ఈ శేఖరేనట, నే చెప్పిన ఆస్థికి వారసుడు.

స్వామి—ఆ !!

జడ్జి—ఆ నన్ను Murder చేయాలని అసలు ప్రయత్నం. అదృష్టంకొద్దీ తప్పిపోయింది. చూడండి? కావాలంటే రావటం రావటం నాదగ్గరికేవచ్చి నాఆస్థి దోచుకొన్నాడు గాని మీావస్తువు వక్కటీ కదిలించలేదు.

విశా—ఏమిటి నాన్నా యిది ఛీ ఛీ ...

జడ్జి—ఆగు నువ్వు?

స్వామి—మీాఆస్థికి అసలువారసుడు వీడా? ఆగండి. గబగబా (Drawer దగ్గరకెళ్ళి తెరిచి లోపలచూసి) అరే. మీా కాగితాలు. మీాకాగితాలేవీ.

జడ్జి—ఊ. ఆ. అవ్వీ పోయాయా?

స్వామి—పోయాయి. దీంట్లోపెట్టి వెళ్ళాగానేను.

జడ్జి—ఆ, వీడే అవ్వీ కాజేశాడన్నమాట! పదండి, తొందరగా ముందు పోలీసు రిపోర్టు యిచ్చి...తర్వాత...

స్వామి—వద్దు. ఇతన్ని పోలీసులకు వప్పచెప్పకూడదు. రండి. ఒకపని చేద్దాం చెప్తారండి. (జడ్జీగార్ని లోపలి గదిలోకి తీసుకు వెళతాడు)

విశా—(కోపంగా సుకుమార్‌తో) అన్యాయం! ఇంత అన్యాయం జరుగుతూవుంటే చూస్తూ వూరుకుంటావేం?

సుకు—బ్బుర్...బుఫ్

విశా—ఏమిటో బుర్ బుఖ్

సుకు—బుర్ ర్ ర్ ర్...బుఖ్.

విశా—ఏమిటా బుర్, బుచను

[ముసలయ్య బైటనించి వస్తాడు]

ముస—బుర్ ర్, బుర్; బుర్ ర్ ర్ బుచ్; బుర్ ర్ ర్ భుఖ్.

విశా—అంటే?

ముస—అంటే "బుర్ ర్ ర్ ర్...బుఖ్"

విశా—బుర్. బుఖ్, బుర్ బుఖ్

ముస—కాదు. బుర్ ర్ బుర్ బుచ్

విశా—బుర్ బుర్ బుఖ్ అంటే అర్ధం?

ముస—ఏమిటో మరి! నాకూ అర్ధం కాలే! స్వామినాథం గార్నడిగితే పిచ్చెక్కిందన్నారు.

విశా—పిచ్చా!

ముస—ఆ. ప్రొద్దున నిద్దర లేచిం దగ్గర్నించీ ఇదే వరస.

విశా—నిజంగా! అయితే నా అదృష్టం పండిందన్నమాటే! ఏం సుకుమార్? ఏం సుకుమారంగా వుందోయ్ నీపిచ్చి బుర్ బుర్ బుచ్ బుఖ్

సుకు—(కోపంగా) క్లిక్

విశా—ఆ? క్లిక్లా? బుర్...బుఖ్...క్లిక్

[సుకుమార్ బుర్ సాగతీసి అంటాడు. ముసలయ్య విశాల సుకుమార్ను అనుకరిస్తూ అంటారు. ఇంకా సాగదీస్తూ బుర్ ర్ ర్ ర్ అని పొగిడిస్తూ వాళ్ళకి నేర్పుతాడు అంతటా యిలా బుర్ బుఖ్ క్లిక్ అంటుండగా శేఖర్ ప్రవేశించి]

శేఖ—ఏమిటిది. అందరూ అదే అంటూరూ?

(మళ్ళా ముగ్గురూ అంటూరు)

శేఖ—ఇదేం అంటు వ్యాధా ఏం?

విశా—ఆ...ఆ...అంటు వ్యాధే! వ్యాపించక ముందే అందరూ పారిపోవడం మంచిది.

శేఖ—ఆ? పారిపోవడ మేమిటి?

విశా—ముసలయ్యా! నువ్వెళ్ళి కాస్త టీ తెచ్చిపెట్టు... తల నొప్పిగా వుంది.

ముస—ఆ...అల్లాగే... (ముసలయ్య వెళ్తాడు)

విశా—(రహస్యంగా) శేఖర్! నీ కింకా తెలియలే! రాత్రి లూటీచేసింది నువ్వేట. నేరం నీమీద మోపబోతున్నారు.

శేఖ—ఆ!

విశా—ఆ...ఎంతత్వరగా పారిపోతే అంత మంచిది. పో .త్వరగా

శేఖ—ఏమిటది?

విశా—ఆలోచనకు టైం లేదు. వాళ్ళు అక్కడేదో ఆలోచిస్తున్నారు. ఏదో చెయ్యాలనీ. త్వరగా పారిపో...ఊఁ.

(శేఖర్ పారిపోబోగా సుకుమార్ అతన్ని పట్టుకుంటాడు శేఖర్ వదలించుకోబోగా)

విశా—ఏమిటది? ఒదులు

సుకు—బుర్...బుఫ్...బుర్ (పట్టు వదలడు)

విశా—బుచ్ లేదు. గిఫ్ లేదు. వదులు వదుల్తావా లేదా ?
(ప్రక్కనున్న కర్రతీసుకుని బెదరిస్తుంది.) వదుల్తావా ?
వెయ్యమన్నావా ? వదుల్తావా ? (కర్రతో సుకుమార్
నెత్తిమీద కొడుతుంది. సుకుమార్ పడిపోతాడు)

శేఖ—ఆ, ఆ, కొట్టారా ! అరే ! బాబూ... బాబూ ?

విశా—లేవడేం (ఆదుర్దాగా) సుకుమార్ ! సుకుమార్ !
దెబ్బ బాగా తగిలినట్టుంచే ?

[లోపల్నించి స్వామినాథం జడ్జీవస్తారు]

జడ్జి—ఏమిటిక్కడ కేకలు.

స్వామి—అదేమిటి ! వాడల్లా పడిపోయాడేం ! (దగ్గరకెళ్ళి
సుకుమార్‌ను కదిపిచూచి,) ఏమిటిది శేఖర్...?

శేఖ—ఏం లేదు. దెబ్బబాగా తగిలింది.

స్వామి—ఎవరు కొట్టారు ?...ఎవరు ?

శేఖ—ఆ... నేనే...

స్వామి—ఆ...నువ్వు కొట్టావా ! మావాణ్ణి...?

విశా—శేఖర్...అనవసరంగా నీమీద వేసుకుంటావేం ?

శేఖ—మీరూరుకోండి.

స్వామి—అనవసరంగా ఎందుకుకొట్టావ్ ?

జడ్జి—ఇది రెండోది; స్వామినాథంగారూ ! ఇలాంటిరౌడీలను
చేరదీస్తే...మనందరి గతీ యింతే...చివరకి. వెధవని.
ఇందాకే పోలీసుల్కి వప్పచెపుదాం అంటే వద్దన్నారు.
రాత్రి నాకైంది. ఇప్పుడీ కుర్రవాణ్ని యిట్లా... శేషటి
సంగతి కాస్త ఆలోచించుకోండి.

విశా—అయ్యయ్యో! అదేమిటి? రాత్రిసంగతీఅబద్ధం. ఇప్పటి సంగతి అంతకంటె అబద్ధం. సుకుమార్ ని కొట్టింది నేనూ ఈకర్రతో... ఈచేతుల్తో...

[ముసలయ్య టీ తీసుకువస్తాడు]

ముస—ఇందండి...'టీ'

విశా—వద్దు పో.

జడ్జి—నువ్వా...

విశా—ఆ.

జడ్జి—ఎందుకని?

విశా—కోపంవచ్చి

జడ్జి—ఎవరైనా కోపంవస్తే నే కొడతారు?...నీకెందుకుకోపం వచ్చిందేం, ఇతనిమీద...?

(విశాల మాట్లాడదు)

స్వామి—శేఖర్! మాట్లాడవేం? ఎవరుకొట్టారు?

శేఖ—నేనే.

విశా—అతను నేరం నెత్తిమీద వేసుకుంటున్నాడు. అబద్ధం చెప్తున్నాడు.

స్వామి—ఆసంగతితర్వాత ఆలోచిద్దాం...రా ముసలయ్యా వీణ్ని లోపలికి తీసుకెళ్దాం సాయం పట్టూ.....

(ముసలయ్య సాయం చెయ్యగా ఇద్దరూ సుకుమార్ ని లోపలికి తీసుకువెళతారు)

విశా—శేఖర్ ఇంకా నుంచున్నావేం? పరిస్థితి అర్థంకాలే?

శేఖ—అయింది.

జడ్జి—ఆ...!

శేఖ—వెళ్ళొస్తాను.

జడ్జి—ఆగు (ప్రక్క నేవున్న తుపాకీ అందిపుచ్చుకుని) కదిలితే జాగ్రత్త!

విశా—ఆ...!

శేఖ—(ఆగాడు)

విశా—నాన్నా! ఏందుకు నాన్నా! అతన్ని అనవసరంగా పట్టిస్తారు. (మాట్లాడుతున్నట్టు దగ్గరికి వెళ్ళి అకస్మాత్తుగా జడ్జిచేతిమీాద కర్రతో కొట్టగా పిస్తోల్ కిందపడ్తుంది. శేఖర్ పారిపోతాడు)

జడ్జి—(కోపంగా) నువ్వింత రాటుసివనుకోలేదు. నాకు వ్యతిరేకంగా నన్నే ఎదిరించి...

విశా—నాన్నా...

జడ్జి—నా విరోధుల్తో చేర్తావన్నమాట.

విశా—నాన్నా! నేనొక్క మాటడుగుతాను చెప్పు. నీకెందుకొచ్చిన ఆశయిది?

జడ్జి—ఆశ ఎందుకొచ్చినా...నాకొచ్చే లాభం నీదికూడాను.

విశా—మనకున్నది మనకు చాలదూ? అన్యాయంగా వారి ఆస్తికీ వీరి ఆస్తికి అర్రులు చాచడం దేనికి?

జడ్జి—ఏడిశావ్, నువ్వూరుకో. నా ఆస్తి నీకు దక్కాలంటే వాడి నామరూపాల్లేకుండా పోవాలి; నీ బాగుకోరుకుంటే నాకు అడ్డంరాకు.

విశా—అల్లాగా...ఆ! ఊఁ!

జడ్జి—మూర్ఖంగా ఈ పెచ్చిపనులు చేస్తే నీకూ ఆగతే పట్టగలదు.

విశా——అయితే, (ఆలోచించి) ఊఁ. సరే.

జడ్జి——నీ భవిష్యత్తు బాగుండాలని వుంటే నే చెప్పినట్టు చెయ్యి.

విశా——ఏంచెయ్యమంటావ్?

జడ్జి——నే చెయ్యమన్నట్టు చేస్తావా?

విశా——ఆ, చేస్తాను.

జడ్జి——అయితే ఈతడవ వాడిక్కడకొస్తే నాతోవచ్చి చెప్పు.

విశా——ఏంచేస్తావ్?

జడ్జి——కాల్చి, చంపేస్తాను. అదుగో నీకెందుకూ (లోపల్నించి స్వామినాథం వస్తాడు)

జడ్జి——ఎట్లావుందండి అతనికి?

స్వామి——అంత పెద్ద దెబ్బ కాదులెండి, కాస్త మాట్లాడుతున్నాడు ఆ... ఈ... శేఖరేడీ.

జడ్జి——పారిపోయాడు. ఇంకా ఇక్కడెందుకుంటాడు?

స్వామి——పారిపోయాడా! ఎందుకు పారిపోనిచ్చారండీ! అరెరే.

జడ్జి——ఎక్కడికి పారిపోతాళ్ళెండి, రండి, పోలీసులికి రిపోర్టిచ్చివద్దాం.

స్వామి——అదేంలాభంలేదండీ! వాడిసంగతి మీకు తెలియదు. ఏంచేసినా, వాణిక్కణ్ణించి కదలనియ్యకుండా చెయ్యాలి. వాడెళ్ళి వాంగల్తో పరీకయితే యింకేమన్నా వుందా?

జడ్జి—అంత భయమెందుకండీ! వక వెధనని చూసి. పోలీసు రిపోర్టు యిచ్చివద్దాం రండి.

స్వామి—. ఈ అడవిలో పోలీసుల ఆటలేంసాగవ్. వాడు పగబడితే తాచు. వాడిభయంవల్లే దొంగలు మెదలకుండా వున్నారు.

జడ్జి—ఉంటే వస్తారు. పదండి. ముందు యీసంగతి పోలీసు రిపోర్టు యిచ్చివద్దాం. మనంకూడా కాళ్ళు బారచాపుక్కూర్చోటం పనికిరాదు. మనం తర్వాత ఏంచేసినా ముందు రిపోర్టిచ్చి వుంచడం మంచిది. రండి.

స్వామి—సరే పదండి. అంతకంటే చేసేదీలేదు. ఎట్లాగో అట్లా అవుతుంది.

[ఇద్దరూ బయలుదేరి వెళతారు. విశాల ఆలోచిస్తూ అక్కడే వుంటుంది. లోపల్నించి సుకుమార్ వస్తాడు]

విశా—ఏంసుకుమార్ ! ఎల్లావుంది తల?

సుకు—(కోపంగా) నోరుముయ్.

విశా—కోపంవచ్చిందా, కొట్టానని?

సుకు—రాదూ? పిల్లేమండా వచ్చిందిగాని లేకపోతే ప్రాణాలు తీసేవాణ్ణి.

విశా—పోనీలే కోప్పడకు. కాస్త దెబ్బ తగిలినా పడిపోయిన మాట తిరిగి వచ్చింది. అందుకు సంతోషించు.

సుకు—ఆ! అరరే. (నాలిక కరుచుకుంటాడు)

విశా—చిన్న దెబ్బతో ఎంత వైద్యంచేశానో చూడు?

సుకు—మాట పడిపోయినమాట మర్చిపోయానే?

విశా—ఆ! అయితే, మాటనిజంగా పడిపోతే!

సుకు—బుర్, బుఫ్.

విశా—ఇంకానా?

సుకు—ఆ.

విశా—ఏమిటీ "బుక్" కి అర్థం

సుకు—అదంతా వుందిలే.

విశా—చెప్పకూడదా?

సుకు—మరేంలేదు. మా నాన్న రాత్రంతా నిద్రపోతూ గురకపట్టాడు. అది బుర్ బుఫ్. నేను మేలుకూర్చుని ఫోటోలు తీస్తున్నా. అదిక్లిక్. ఆయన బుర్ బుఫ్, నేను "క్లిక్". ఈ రెండింటితో నా బుర్ర వెర్రెక్కిపోయింది రాత్రంతా.

విశా—మీనాన్న నిద్రా, నీవు Photo లూనా!

సుకు—Shut up! ఇప్పటికే చెప్పకూడనివి చాలాచెప్పా.

విశా—ఒకప్పుడు నీకు బుర్రవుందనిపిస్తుంది. ఒక్కొక్కపుడు లేదనిపిస్తుంది.

సుకు—బుర్రలేని వాళ్ళకంతే

విశా—నీకు బుర్రవుండి నాకు లేదంటావా?

సుకు—నీ బుర్రయిక్కడ లేదు. శేఖర్‌గాడి మీదుంది.

విశా—అంటే?

సుకు—వాడి మీద నీ మనసు.

విశా—ఛ, ఛ, వాడు వట్టి రౌడీ వెధవ.

సుకు—ఛ, ఛ, మరి వూరికే వాణ్ణితప్పించాలని చూశావా?

విశా—ఆ! అన్యాయంగా వాడిమీద అపరాధం వేస్తుంటే మనం అడ్డుపడకూడదా? నా మనసు ఎవరిమీద వుందో నిజంగా చెప్పనా?

సుకు—ఒద్దులే.

విశా—నీమీద వుందంటే నమ్ముతావా?

సుకు—May God save me!

విశా—ఆ దేముడే నన్ను రక్షించాడు ఆ రౌడీవెధవపాల పడకుండా.

సుకు—దేముడు వుండే వుంటాడుగానీ, మంచిపనులు చెయ్యకుండా ఎప్పుడూ చెడ్డపనులు చేసి వూరుకుంటాడేం

విశా—దేముడు నన్ను రక్షించడం చెడ్డపనంటావా?

సుకు—నీకు బుర్ర లేకపోయినా విషయం చప్పున గ్రహిస్తావ్.

విశా—బుర్రవుండే కాబోలు ఇందాకా శేఖర్ని పారిపోకుండా పట్టుకున్నావ్.

సుకు—అక్షరాలా, బుర్రవుండీ.

విశా—అవునవును. అప్పుడు నీకున్న తెలివి నాకు లేకపోయింది. అందుకని అతన్ని వదిలించాను. ఇప్పుడు అట్లా కాదు. శేఖర్ కనిపిస్తే కట్టిపడేసి పెద్దవాళ్ళని పిలుద్దాం.

సుకు—పిలిచి ఏంచేస్తావ్.

విశా.—వాళ్ళు వచ్చి వాడి రూపు మాపుతారు. మా నాన్న అదే అన్నాడు. పేల్చి చంపేస్తాట్ట. అతను చచ్చిపోతే మనకి మంచిదికదూ! అతని ఆస్థి అంతా మనకి వస్తుంది.

సుకు—అవును. యిరవై అయిదు ఎకరాలు.

విశా—నీ కదంతా తెలుసా?

సుకు—ఆ పొలం Plan తో సహా.

విశా.—అయితే మానాన్న వేసిన ప్లానంతాకూడా తెల్సా?

సుకు—ఆ, మానాన్న దగ్గరున్న Plan కూడా.

విశా—మీ నాన్న ప్లానా?

సుకు—అవును.

విశా—ఏం ప్లానూ?

సుకు—ఇతర ఆస్తులు సంగ్రహించటం.

విశా—ఆస్థి వస్తుందంటే ఆశగానే వుంటుంది గాని పాపం కదూ అలా కూడ గట్టుకోవటం?

సుకు—నువ్వసాధ్యురాలవే!

విశా.—ఏం?

సుకు—శేఖర్ కు వ్యతిరేకంగా మాట్లాడుతూన్నట్టు నటిస్తూ నన్ను తిప్పెయ్యాలని చూస్తున్నావ్.

విశా—ఆ! నువ్వింత తెలివి గలవాడివా!

సుకు—అబ్బే, కొంతే!

విశా—అయితే నువ్వు ఎవరి పక్షం?

సుకు—బుస్ బుఫ్ క్లిక్.

విశా—ఆ.

సుకు—బుర్ బుఫ్ క్లిక్.

విశా—అదేమిటి! మళ్ళీ అవతారం మార్చేశావ్.

సుకు—బుర్ బుఫ్ క్లిక్

[అంటూ లోపలివేపుకు చూపిస్తూ సౌంజ్ఞ చేస్తాడు. ముసలయ్య వస్తాడు క్లిక్ క్లిక్; అంటూ నోరుమూసుకుని విశాలచేతగూడా అల్లాగే సౌంజ్ఞలతో నోరు మూయించి ముసలయ్యావేపు తిరగగా]

ముస—నేనూ క్లిక్కా సరే. (నోరు మూసుకుంటాడు; సుకు మార్ బుర్ బుర్ అంటూ వెళ్తాడు)

విశా—హు. ఉత్తపిచ్చి.

ముస—ఏం పిచ్చో లెండి! నాకు మాత్రం బలే కిలాడీలాగు కనిపిస్తాడు.

విశా—అదేం!

ముస—రాత్రి నేనుకూడా వీరితోనే వున్నానుగా! అక్కడంతా చూశా.

విశా—ఏం చూశావ్?

ముస—స్వామినాథంగారు ఏదో మాత్రలు వేసుకోమని యీాయనగారికిచ్చారు.

విశా—ఊ...?

ముస—ఆరి నటు తిరగనిచ్చి ఆరికాఫీలో యీామాత్ర పడేశాడు యీాయన.

విశా—ఆ!

ముస—శాస్త్రి స్వామినాథంగారు లాగేశారు. అవి ఏం మాత్రంలోగాని ఆరు తెల్లార్లూ నిద్రపోయారు, ఈయనా...

విశా—ఈయన?

ముస—ఈయన రాత్రంతా కాగితాలికి ఫోటోలు తీస్తూ కూర్చున్నాడు.

విశా—కాగితాలకి ఫోటోలా!

ముస—ఆ.

విశా—ఏం కాగితాలవ్వి?

ముస—ఏమో మరి? మొన్న ఇక్కడికి వచ్చినవాడు లేడూ తలకి గుడ్డకట్టుకొని వచ్చాడూ...

విశా—ఆ...ఆ దొంగ...

ముస—వాడు తెల్లారుఝామునవచ్చి స్వామినాథంగారితో మాట్లాడా లన్నాడు ఈయన "పో పోయి మాట్లాడూ" అన్నాడు. వాడు దగ్గరకెళ్ళి స్వామినాథంతో మాట్లాడు తుంటే తళుక్కుమని ఈయన Photo తీశాడు.

విశా—వాడికా!

ముస—ఆ వాడికే! వాడు దాంతో మాటలూగీటలూ మాని పరుగు తీశాడు. ఆ! (అని చెబుతూ బయిటికి చూసి తెల్ల బోతాడు) ఆ......

విశా—ఏమిటది!

ముస—అటు...అటు చూడండి......

విశా—(వెనక్కి తిరిగిచూసి) శేఖరా...ఏం యిటువచ్చావు?
(అంటూ శేఖర్ రావటంచూసి అతనిదగ్గరకు వెళ్తుంది.)

శేఖ—మీనాన్న ఏడీ. ఏడీ? ఆ స్వామినాథం?

విశా—ఎందుకూ?

శేఖ—(కత్తిచూపిస్తూ) పొడిచి చంపేస్తాను,

విశా—ఆ.

శేఖ—చూస్తాను ఈ అడవిలో ఎవరడ్డం వస్తారో.

విశా—ఏమిటది?

శేఖ—నా ఆస్థి కాజేశారు, నాప్రాణాలకే ఎత్తులు వేశారు. ప్రాణాలు రక్షించిన నాకే ఎసరు పెడుతున్నారు. చెప్పు ఎక్కడున్నారో? చంపిపారేస్తాను.

[బయట కారు హారన్ శబ్దం వినవస్తుంది]

విశా—అరుగో.

శేఖ—ఏరీ?– అరుగో! రండి నా ఆగర్భశత్రువులు– గుండెలు చీల్చి.........నెత్తురు తాగుతాను.

[అంటూ కోపంగా ఎదురు వెళ్ళబోతాడు. ఇంతలో విశాల గబగబా వెళ్ళి శేఖర్ని ప్రక్కకులాగేస్తుంది, కెవ్వున కేక వేస్తూ లోపల రివాల్వర్ పేలినశబ్దం–గుండుతగిలి ముసలయ్య కేక వేసి పడిపోయాడు]

విశా—శేఖర్, పారిపో, పారిపో.

[శేఖర్ లోపలివేపుకి పారిపోతాడు. స్వామినాథం. జడ్జీగారూ బైటవేపునించి ప్రవేశిస్తారు. సరాసరి ముసలయ్యదగ్గర కెళ్ళి అతన్ని చూస్తారు. ఒకరి మొహం వకరు చూచుకుంటారు]

విశా—ముసలయ్యా ముసలయ్యా (అంటూ వణికిపోతూంది)
జడ్జి—విశాలా (విశాలదగ్గర కెళ్తాడు.)
విశా—ముసలయ్యా, ముసలయ్యా.
జడ్జి—ఏమిటండీ యిది. ఇట్లా వణికిపోతోంది?
స్వామి—గాభరా పడ్డట్టుంది.
విశా—ముసలయ్యా. ముసలయ్యా, ముసలయ్యా (అలా పాడుగునా అంటూనే వుంటుంది)
జడ్జి—ఊఁ (నిట్టూర్చి) ఇతనేం అంటున్నాడు?
స్వామి—ఇంకా ప్రాణం పోలేదు.
జడ్జి—ముసలయ్యా. (దగ్గరకు వెళ్ళి లేపబోగా)
స్వామి—ఆగండి.
[రివాల్వరు తీసుకుని ముసలయ్యను పేల్చేస్తాడు. విశాల కెవ్వున కేక వేసి మళ్ళీ పడిపోతుంది. జడ్జి ఆమెదగ్గరకు వెళతాడు]
జడ్జి—విశాలా, విశాలా!
స్వామి—మరేం ఫర్వాలేదు, గాభరాపడ్డది. రండి ఆ శేఖరుగాణ్ణి కూడా వెతికి హతమారుద్దాం.
విశా—(వణుకుతూంది)
జడ్జి—ఆగండి, నామతికూడా పోతుంది.
స్వామి—బాగానేవుంది. ఆ శేఖరుగాడు తప్పించుకు పోతే మన ప్రాణాలుకూడా పోతాయి.
జడ్జి—అయితే ఎవర్నన్నా పిలవండి, సహాయంగా.
స్వామి—వాడి కెవరెదురొస్తారీవ్రూళ్ళో? వాడితోక జ్జాకు మనుషులు కావాలంటే, అడవిలో దొంగలికి కబురు చెయ్యాలి.

జడ్జి—అడవిలో దొంగలా ?

స్వామి—ఆ, వాళ్ళే, వీడు వాళ్ళను కూడగట్టుకోకముందే మనం వాళ్ళను కూడగట్టుకోవాలి, (తెరలోకిచూసి, తెల్లబోయి) ఆ! ఆ! అదేమిటి? మావాడు శేఖర్ని పట్టుకున్నాడు! ఓరి వెధవా! వెధవన్నర వెధవ కాని. (ఎదురు వెళ్తాడు)

జడ్జి—అరే, అరే.

[శేఖర్ని తాడుతో కట్టేసి సుకుమార్ లాక్కువచ్చి కింద పడేస్తాడు]

స్వామి—ఇక భయంలేదు అంతా నిశ్శబ్దంగా జరిగిపోతుంది. రివాల్వరు ఏదీ ? దీంతో వీణ్ణికూడా (అంటూ రివాల్వరు బైటికి తీస్తాడు)

జడ్జి—ఆగండి. (చేత్తో రివాల్వర్ పట్టుకుని ఆపు చేస్తాడు)

స్వామి—ఏం ?

జడ్జి—ముసలయ్యా హత్య వీడిమీదికి నెట్టేద్దాం... మనం చెయ్యి చేసుకోవటమెందుకూ ?

స్వామి—అట్లా అంటారా !

జడ్జి—అంతే... లేకపోతే కేసులో మనమే ఇరుక్కోవాలి. ఇలా అయితే నేరం వాడిదీ...సాక్ష్యం మనదీ అవుతుంది

స్వామి—అవును. అదే బాగుంది.

జడ్జి—మాఅమ్మాయినోరు నేను కట్టెయ్యగలను. మీవాడి కిదివరకే మతిలేదు. ఆ రివాల్వర్ కూడా శవం దగ్గరే. పడెయ్యండి. వెళ్ళి పోలీసుల్ని పిల్చుకురండి.

స్వామి—అలాగే. మరి...మీరూ?

జడ్జి—నేను ఏక్కడికన్నా వెళ్ళి ఒక అరగంట తిరిగొస్తాను

స్వామి—ఏం!

జడ్జి—సాక్ష్యానిక్కూడా సాధ్యమైనంతవరకు రాకుండా వుండాలని...

స్వామి—సరే పదండి.

జడ్జి—(విశాలదగ్గరకెళ్ళి) విశాలా? విశాలా?

విశా—ముసలయ్యా.....ముసలయ్యా.....ముసలయ్యా...

జడ్జి—విశాలా! విశాలా! ఏమిటమ్మా పలకవేం.

స్వామి—ఫరవాలేదు. కాస్త గాభరా పడ్డది. త్వరగా వచ్చేద్దాం రండి.

జడ్జి—సరేపదండి.

[ఇద్దరూ వెళ్తారు; వాళ్ళు వెళ్ళిన తర్వాత సుకుమార్ ముసలయ్య శవాన్ని లోపలగదిలోకి లాక్కుపోతాడు. సుకుమార్ లోపలికి వెళ్ళటం గమనించి విశాల లేచివెళ్ళి శేఖర్ కట్లు విప్పుతుంటే సుకుమార్ ప్రవేశిస్తాడు.]

సుకు—ఆగు.

విశా—ఆగను.

సుకు—ఆపగలను.

విశా—నీతరం కాదు.

సుకు—వెళ్ళి దూరంగా నుంచుంటావా లేదా?

(గబగబా రివాల్వరు కిందనుంచి తీసి చూపిస్తాడు.)

విశా—(వెళ్ళి వెనక్కి నుంచొని) అయితే నువ్వుకూడా వాళ్ళలో చేరి యితన్ని పట్టియిస్తావా.

సుకు—ఏదో చేస్తాను; నువ్వూరుకో

విశా—ఊరుకోను. ఇంత అన్యాయం జరుగుతూంటే ఎట్లా వూరుకోమంటావు ?

సుకు—చూస్తూ వూరుకో.

విశా—అహా...ఏట్లేదు. అతన్ని వదిలిస్తాను. నన్ను వేల్చినా సరే...ఏం చేసినా సరే.

[సుకుమార్ అడ్డంపోయినా, తప్పించుకొని శేఖర్ కట్లు వదిలిస్తుంది, శేఖర్ మిగతాది త్వరగా విప్పు కొంటాడు]

శేఖ—ప్రాణం రక్షించావు. చీకట్లో వెనకనించి పట్టు కున్నాడు శనిలాగ. ఇంక ఎవరు పట్టుకుంటారో చూస్తాను.

విశా—సరేలే...త్వరగాపో...యిక్కణ్ణించి.

శేఖ—ఆ...వస్తా. (పారిపోతాడు)

సుకు—ఛీ ఛీ. అంతా పాడుచేశావ్. (విసుగ్గా రివాల్వర్ కింద పడేస్తాడు)

విశా—నీ దొంగ నాటకమంతా ఏమిటి...వాళ్ళ దగ్గరపిచ్చి వాడిలా వుంటావ్...వాళ్లు లేనప్పుడు బాగానే మాట్లాడ తావ్ ?

సుకు—దానిసంగతి తర్వాత. కాని యివ్వాళ నువ్వేం పని చేశావో తెల్సా ?

విశా—నేచేసిన పనినాకు తెల్సు...నిరపరాధిని విడిపించాను. నీపన్లకే అర్థం కనిపించదుకాని......

సుకు—కాదు నీపని అపరాధులకే ఉపకారం...నిరపరాధులు పోలీసు స్టేషన్ కెళ్ళి రిపోర్టు చేస్తారుగాని పారిపోరు.

విశా—బాగున్నాయి తెలివితేటలు. నువ్వు చేసినపనికి నేనే మొగాణ్ణయితే ఏంచేసేవాణ్నో తెలుసా?

సుకు—వేరే అననక్కర్లే! ఇదంతాచూసి నువ్వు ఆడదానివని ఎవరనగలరు?

విశా—మొగాణ్ణయితే తల బద్దలుకొట్టేదాన్ని.

సుకు—ఆ...ఆ...మరి నేనే ఆడదాన్నయితే ఏంచేసేవాణ్ణో తెల్సా!

విశా—ఏం చేస్తావేం?

సుకు—నిన్ను పెళ్ళిచేసుకొనేవాణ్ణి.

విశా—మొత్తుకున్నట్టుంది.

సుకు—చూస్తూవుండు. నిన్ను నే పెళ్ళిచేసుకోబోతున్నాను.

విశా—నువ్వా...నన్నా...?

సుకు—నిన్నే; నేనే; పోలీసుల్ని రానీ.

విశా—ఈ జన్మలోనేనా?

సుకు—ఈ జన్మలోనే...ఈ సాయంకాలమే.

విశా—నామతికూడా పోయిందనుకున్నావా?

సుకు—పోతుంది పెళ్ళయిన తర్వాత. పెళ్ళిమాత్రం మతి వుండగానే. చూస్తూవుండు. ఇంకాసేపటికి పెళ్ళిచేసు

కోర్టూనికి నువ్వే వప్పుకుంటావ్. ఆ సంగతులన్నీ, తర్వాత. ముందు ఈ శేఖర్ని తప్పించావు. వాళ్లు వచ్చి శేఖర్ ఎట్లా తప్పించుకుపోయాడని అడిగితే ఏం చెప్పాలో ఆలోచించుకో.

విశా—అవును. ఏం చెపుదాం ?

సుకు—మతిగలదానివిగా...ఆలోచించుకో.

విశా—ఆ...ఆ... (జ్ఞాపకమొచ్చి) నాకు మతిపోయింది. పోయిందిగా! ముసలయ్య పోంగానే, మతిపోయింది.

సుకు—ఇప్పు డుందన్నావుగా?

విశా—లేదు, పోయింది...ముసలయ్య...ముసలయ్యా

(అంటూ వణుకుతూ కూర్చుంటుంది)

సుకు—అలా వున్నమతి పోగొట్టుకో! బాగుపడ్తావ్ ! నాకు మతి అసలే లేదు. బుర్...బుఫ్...క్లిక్,

విశా—ఆ...Idea ఒక Idea తట్టింది.

సుకు—ఏమిటది ?

విశా—ఇదిగో రివాల్వర్...(రివాల్వర్ తీసుకొని) దీంతో నిన్ను పేల్చిపారేస్తాను. మతిపోయినట్టే పడివుంటాను.

సుకు—ఆ!!

విశా—లేకపోతే మతిపోయినవాడివి పోయినట్టే పడివుండక, అన్యాయంగా శేఖర్ని పట్టిస్తావా...

సుకు—అయితే నన్ను పేల్చేస్తావా !

విశా—ఆc, ఒక్క గుండుతో.

సుకు—చాల్లే...అక్కడ పెట్టు. ఎవ్వడన్నా వింటే నవ్వి పోతాడు.

విశా—వేళాకోళం అనుకున్నావా!

సుకు—నిజంగా నంటావా?

విశా—ఆ...నువ్వు బ్రతుకున్నంత నిజంగా.

సుకు—అయితే కానీ; పేల్చు...(అక్కడున్న పేపర్ తీసి చదువుతుంటాడు)

విశా—(మీటనొక్కి) ఆ....

సుకు—(నవ్వి) ఆఁ, దాంట్లో గుళ్ళు లేవులే! అక్కడ పెట్టిరా.

విశా—లేవ్రా...నీకు తెలుసా... (రివాల్వర్ మళ్ళీ నొక్కి చూస్తుంది, పేలదు)

సుకు—ఆ...తెలుసు

విశా—అరే! ఏమో అనుకున్నాను, నువ్వు...నువ్వు... బాగా తెలివిగలవాడివే!

సుకు—ఆ...ఆ...తెలివిగలవాణ్ణే. ఉన్న తెలివి నిన్ను పెళ్ళి కొంటే పోదు.

విశా—చాల్లే, వూరుకో! వళ్ళు మండేమాటలు.

సుకు—చాల్లే, కట్టిపెట్టు, వాళ్ళొస్తున్నారు.

విశా—వస్తున్నారా!!

సుకు—ఆ, జ్ఞాపకముందా, నీమతి యిందాక పోయింది?

విశా—ఆ పోయిందిగా, పోయింది. (వెళ్ళికూర్చుని) ముసలయ్యా...ముసలయ్యా...ముసలయ్యా...

సుకు—మరి అల్లా ఆమూాల పడివుండు.

విశా—ముసలయ్యా, ముసలయ్యా (అంటూ) మరినువ్వూ?

సుకు—బుర్, బుఛ్ క్లిక్ బుర్, బుచ్ క్లిక్ (అలాఅంటూ కాసేపుండి) చెవులుగింగుర్లెత్తుతున్నాయి; కాసేప్పూరుకో.

విశా—రావటంలే! వస్తూన్నారన్నావ్?

సుకు—నాకు మతిలేదు, నీకుందిగా! వస్తున్నారో, లేవో, చూచుకో లేవ్వా?

విశా—నన్నాడిస్తున్నావా?

సుకు—లేదు. ఏడిపిస్తున్నా.

విశా—ఎందుకు ఏడ్పించటం (ఆగి, ఏవో ఆలోచించి) ఓ సంగతి అడుగుతాను చెప్తావా.

సుకు—చెప్తే ఏమిస్తావ్.

విశా—ఏమీ యివ్వను.

సుకు—ఏమీ యివ్వద్దుగాని, పోనీ, పెళ్లి చేసుకుంటావా?

విశా—(నవ్వి) నీకు మతుందా? అసలు లేదా?

సుకు—ఆ వుంది; ఎక్కడికీ పోలే.

విశా—ఇప్పుడు కాదు. ఎప్పుడూవుందా?

సుకు—ఆ, వుంది. ఎప్పుడూ, ఎక్కడికీ, పోలే.

విశా—మరెందుకూ యీనటన?

సుకు—సరదాకి.

విశా—ఇదేం సరదా! మతిలేని సరదా!

సుకు—అదే నా సరదా.

విశా—చెప్పవా? చెప్తావా?
సుకు—మరి పెళ్ళిచేసుకుంటావా? చేసుకోవా?
విశా—చేసుకుంటే చెప్తావా?
సుకు—నోటితో చెప్తే కాదు. రాసియిస్తే చెప్తా.
విశా—కాగితంమీద రాసి యివ్వాలా?
సుకు—స్టాంపుమీదైతే మరీమంచిది.
విశా—అల్లాగే (అతను అనే మాటలు వేళాకోళంగా తీసుకుని, వ్రాసియిచ్చి) మరిచెప్పు.
సుకు—మానాన్నెవరో తెల్సా?
విశా—ఎందుకు తెలియదూ? స్వామినాథంగారు.
సుకు—అంతే నీతెలివి. ఆయనొక గజదొంగ.
విశా—ఆ! ఆ!
సుకు—ఆ! దొంగల్నే దోచుకుంటాడు. ఏదొంగ ఏం కాజేసినా అది కొనేది మానాన్నే.
విశా—ఆ!
సుకు—ఆ కొనటంలోనూ, వందరూపాయల వస్తువు ఏభైరూపాయి లిచ్చి దొంగల్నే టోపీవేస్తాడు.
విశా—ఆ!
సుకు—ఆ దొంగలోకల్లా బలమైన దొంగ శేఖర్. దొంగతనం యిష్టంలేని దొంగ. అది కనిపెట్టి వాణ్ణి ఇంట్లో కట్టేసుకున్నాడు, మానాన్న.
విశా—అహా!

సుకు—కాలేజీనించి తిరిగివచ్చి ఒకసారి యీసంగతంతా కని పెట్టాను. ఏమిటీ అన్యాయమని ఎదురుతిరిగాను.

విశా—నువ్వా!

సుకు—ఆ! నన్నూరుకో పెట్టాలని చూచాడు. లాభంలేక పోయింది. అప్పట్నించీ తను చేసే పన్లునాకు తెలియకుండా వుండటానికి నాకు మత్తుమాత్రల్లు యివ్వడం మొదలెట్టాడు.

విశా—నీకా! మత్తుమాత్రలా!...అహా.

సుకు—అది కనిపెట్టి ఆ మాత్రలుమార్చి ఆసీసాలోనే వేరే మాత్రలు పెట్టాను. రోజూ మత్తు నటిస్తూన్నా.

విశా—అరే!

సుకు—తర్వాత ఇంకేమైనా చేస్తాడనే భయంతో మతేపోయి నట్లు నటిస్తున్నా, అప్పట్నించీ– వాళ్ళు వస్తున్నారు వెళ్ళి కూర్చో.

విశా—నిజంగానా!

సుకు—నీకు మతిలేనంత నిజంగా?

విశా—మరి ఇంతకూ ఈ నటన ఎందుకు?......

(బైటనించి హారన్ శబ్దం వినవస్తుంది)

సుకు—(అగ్గో క్షిలో) హుష్, బుర్, బుఫ్, క్లిక్ బుర్, బుఫ్, క్లిక్.

విశా—ఆ సరే. (వణుకు నటిస్తూ) ముసలయ్యా, ముసలయ్య

[ఇద్దరూ అట్లావుండగా, స్వామినాథం, పోలీసులూ, పోలీస్ ఇనస్పెక్టర్, జడ్జీ వస్తారు]

జడ్జి—(దగ్గర కెళ్ళి) విశాలా, విశాలా, తగ్గలే, విశాలా?

విశా—ఆఁ. (కళ్ళు తెరచి చూసి) వచ్చారా, అమ్మయ్యా, (శేఖర్‌ని పట్టుకుని పోలీసురావటం చూసి తెల్లబోయి "అదేమిటీ... శేఖర్" అని అరిచి మళ్ళీపడిపోతుంది)

జడ్జి—ఆ... పట్టుకొచ్చాం పారిపోతున్న వాణ్ణి. విశాలా! ఇటుచూడు.

విశా—(మళ్ళీ పడిపోయింది.)

జడ్జి—విశాలా... విశాలా

సుక—బుర్ బుఘ్ క్లిక్, బుర్ బుఘ్ క్లిక్ (అని శేఖర్ని చూపిస్తాడు)

స్వామి—శేఖర్ని చూసి భయపడి పడిపోయిందా? బాగానే వుంది పిచ్చిగోల! ఇదండీ, సంగతి ఇనస్పెక్టర్ గారూ! ఈ శేఖర్ ముసలయ్యను పేల్చేశి పారిపోతూంటే మేము పట్టుకొని ఇక్కడ కట్టిపడేసి మీదగ్గరకొచ్చాం. ఈ అమ్మాయి ఈ హత్యా అదీ చూచి గాభరాపడి, తెలివి తప్పి పడిపోయింది. మా వాడికి మతి యిదివరకే లేదు. మతిలేని వాళ్ళిద్దర్నీ ఇక్కడ వుంచి రావటం మా దేతప్ప యింది. శేఖరుగాడు తప్పించుకున్నాడు. మీరందరూ యిన్ని తుపాకీలతో మాతో రాకపోతే మా యిద్దరిలో వకరిదన్నా ప్రాణం పోయ్యేది.

ఇన—మరి డెడ్ బాడీ (Dead body) ఏదీ?

సుకు—క్లిక్ క్లిక్ (అంటూ లోపలికి చూపిస్తాడు)

స్వామి—అక్కడి కెవరు లాగారు?

ఇన—ఎందుకు లాగారు? బాడీని Spot నుంచి కదలించ కూడదు.

స్వామి—ఈ పిచ్చి వెధవే లాగాడో...ఆ శేఖరే లాగాడో! రండి చూసి వద్దాం. (వెళ్ళిచూసి వస్తారు. అందరితో పాటు సుకుమార్ వెళ్ళాడు కాని తిరిగి వాళ్ళతో రాలేదు)

స్వామి—మీకింకా ఏమన్నా వివరాలు కావల్సివస్తే అడగండి చెప్తాం.

ఇన—ఇంకేం కావాల్లెండి...ఇంతకూ ఎక్కడుండగా తగిలిందీ గుండు దెబ్బ.

స్వామి—ఇక్కడ, ఇదిగో రక్తం మరక.

ఇన—ఆఁ. సరే తీసుకుపదండోయ్. ఆశవాన్ని Post Mortemకి తీసుకుపదండి. ఎవరోవకరు పోయి ఒకబండి పిల్చుకురండి. (పోలీసు వెళ్ళబోగా)

విశా—ఆగండి, ముసలయ్యను హత్యచేసిందీ శేఖర్ కాదండీ ఇనస్పెక్టర్ గారూ

ఇన—ఆ!

జడ్జి—విశాలా!

విశా—శేఖర్ కాదు హత్య చేసింది. శేఖర్ కాదు హత్య చేసింది...

ఇన—మరెవరూ?

స్వామి—మతి పూర్తిగా పోయినట్టుంది.

విశా—హత్య చేసింది వీళ్ళా, వీళ్ళిద్దరూనూ.

స్వామి—క్షేమా! (నవ్వుతాడు)

ఇన—వీరా...(నవ్వి) పాపం! కాస్త రెస్టుగా ఎక్కడన్నా పడుకోబెట్టండి. గాబరా పడ్డట్టుంది.

స్వామి—ఆ...మరి మనం ఏం చెయ్యాలిప్పుడు?

ఇన—మీరిద్దరూ ఒక Stateme t యివ్వండి చాలు.

[సుకుమార్ లోపల్నించి వస్తూ]

సుకు—ఆగండి. నా సాక్ష్యం రికార్డు చేసుకోండి మొదట.

ఇన—నీదా...మతివున్నవాళ్ళ Statementసే ఇట్లావున్నాయి ఇక మీదా?

సుకు—ఎవరికి మతివుందో ఎవరికి లేదో మీకూ తెలుస్తుంది మతి మీకు వుంటే.

ఇన—ఏమిటి మీరనేదైతే!

సుకు—ఈ ఫొటోలు చూడండి...ఇప్పుడే Devolope చేసి తెచ్చాను.

ఇన—కాని ఫొటోలు చూస్తూ కూర్చునే తీరుబడి మనకు లేదే. (తీసుకు చూసి తెల్లబోయి) ఆ.

సుకు—(ఫొటోలు చూపిస్తూ) ఇదిగో...శేఖర్, ఇదిగో ముసలయ్య...ఇదిగో రివాల్వర్ (బయట ద్వారం చూపిస్తూ] ఆ గుమ్మం దగ్గర్నించి కాలిస్తే...యిక్కడున్న ముసలయ్యకు తగిలింది. సరిగ్గా చూడండి. ఈ ఫొటో యీ గుమ్మం దగ్గర్నించి తీశాను.

స్వామి }
జడ్జి } ఆ!

సుకు—వార్ని కొంచెం పట్టుకోవోయ్ పోలీసూ! ముసలయ్యను పేల్చింది...యీఫొటోలోవున్న శేఖర్ కాదని తేలిపోయింది. ఇంకా అనుమానముంటే ముసలయ్యకు తగిలిన గుండుదెబ్బ కొల్చుకోండి, ఆ కొల్తనుబట్టికూడా దగ్గరగావున్న శేఖర్ పేల్చలేదని తెలుస్తుంది.

[క్రిందవున్న రివాల్వర్ స్వామినాథం తియ్యబోతాడు. విశాల కెవ్వున కేకవేస్తుంది. శేఖర్ ముందుకుదూకి స్వామినాథాన్ని పట్టుకోబోతాడు. తక్కినవారు ఖంగారు పడ్తారు]

సుకు—ఫరవాలేదులే. దాంట్లో గుళ్ళులేవు. కొడుక్కి మత్తుమందిచ్చిన తండ్రి కొడుకుని చంపగలడని నాకు తెల్సు. అందుకే దాంట్లో గుళ్ళు తీసేశాను. ఇనస్పెక్టర్‌గారూ (ఫొటోలో చూపిస్తూ) ఈ గుమ్మం దగ్గర నుంచున్న బొమ్మల్ని చూడండి, కొంచెం Out of focus అయినా హత్య చేసిందెవరో మీరే పోల్చుకోగలరు.

ఇన—అయితే వీరా...(అంటూ స్వామినాథం జడ్జీ వంకా చూస్తాడు)

సుకు—మరే! వీరే...(మరికొన్ని ఫొటోలు తీసిస్తూ) ఈ ఫొటోలుకూడా తీసుకోండి. ఇదిచూడండి (ఫొటోలో చూపిస్తూ) ఇదిగో మా నాన్న దొంగకు తాళంచెవ్వియిస్తున్న ఫొటో, రాత్రి మాయిల్లు లూటీచెయ్యటానికి,

లూటీలో జడ్జీగారి ఆ స్త్రీ కాగితాలుకూడా కాజెయ్యాలని చెప్పి మానాన్న దొంగకి దొంగ తాళంచెవ్వి తిరిగియిస్తున్నప్పుడు... నేనీ ఫొటో తీశాను. లూటీ అయిపోయిం తర్వాత దొంగ మా నాన్న దగ్గరకొచ్చి తాళంచెవ్వి తిరిగియిస్తున్నాడు. అదీ యీఫొటో. జడ్జీగారు రాత్రి మీ ఆ స్త్రీకి. మీ కాగితాల్నీ దోచుకున్నది శేఖర్ కాదని మీకు తెల్సు... మానాన్నే నని మీకు తెలియదు.

జడ్జి—ఆ!

సుకు—ఆశ్చర్యంగా వుందా! ఇక్కడ జరిగే ప్రతీనేరంలోను మానాన్నగారి అజ్ఞాతహస్తం వుంటుంది. (కొన్ని ఫొటోలిస్తూ) ఇవ్వన్నీ తీరుబడిగా చూసుకోండి. మరొక్కటి గ్రహించేవుంటారు. వీరు ఆశపడి శేఖర్ ఆ స్త్రి సంగ్రహించాలని చూశారు. మానాన్న ఆ ఆ స్త్రిని ఇదివరకే సంగ్రహించి అనుభవిస్తున్నాడు. అంతా సరిగ్గా జరిగినా ఆ స్త్రి మీకు దక్కేదికాదు,...విశాలను నాకిచ్చి పెళ్లి చేస్తే తప్ప... పెళ్ళిచేస్తారా?

జడ్జి—ఊఁ!

సుకు—చేద్దురుగాని లెండి. ఇనస్పెక్టరుగారూ! వీరినితీసుకెళ్ళండి. మీరింకా ఏమైనా సాక్ష్యం కావల్సివస్తే సరాసరి నాదగ్గరికిరండి. అన్నిటికీఅన్ని ఫొటోలువున్నాయి. వచ్చేటప్పుడు మరికొంతమంది పోలీసుల్ని తెచ్చుకోండి, మానాన్నకొన్న దొంగవస్తువులు చాలా ఉన్నాయి. వాటి జాబితాలు రాయటానికి చాలామంది కావాలి.

ఇన—సరే పదండి సార్.

జడ్జి—నేనుకూడానా! నేను హత్య చేయలేదుగా?

ఇన—అదంతా నిమ్మదిగా తేల్చుకుందాం. పదండి.

[వాళ్ళంతా వెళ్తారు]

విశా—చాలా పెద్దప్లాను వేశావే.

సుకు—వేశా, వేశా.

విశా—మరి శేఖర్ ఆ స్త్రీసంగతి...

సుకు—అతనికే దక్కుతుంది. చచ్చేటప్పుడైనా నిజం చెప్పరూ మీనాన్నగారూ?

విశా—చెప్తారు. ఇప్పుడు నిజం చెప్పటం తప్పనిసరికూడానూ.

సుకు—ఏమైతేనేం "విషకుంభాల్ని" పగలగొట్టి ఒక నిరపరాధిని తప్పించగలిగాం.

శేఖ—అవును. తండ్రినే బలిపెట్టారు. ఈ ప్రాణం యిచ్చినా మీ ఋణంతీరదు. నాకొచ్చే ఆస్తంతా మీరిద్దరూ తీసుకోండి.

విశా—మీరిద్దరూ అంటావేమిటి?

శేఖ—అదే, మీరిద్దరూనూ.

విశా—అలాకాదు.

శేఖ—ఎల్లాగుకాదు? మీరిద్దరూ పెళ్ళిచేసుకో

సుకు—My God.

శేఖ—లేదు, నాకోసం మీరు ఒప్పుకోవాలి.

సుకు—సరే. ఒప్పుకుంటాన్లే!

శేఖ—మీరూ ఒప్పుకోవాలి, అమ్మాయిగారూ.

సుకు—కాదు; చెల్లాయిగారూ.

శేఖ—ఆ చెల్లాయ్! ఒప్పుకో అమ్మా.

సుకు—అట్టే బలవంతం అక్కర్లే. ఇదివరకే వప్పుకుంది.

విశా—నే నెప్పుడొప్పుకున్నాను?

సుకు—ఇదిగో వ్రాసియిచ్చిన కాగితం.

విశా—(సిగ్గుపడుతుంది) వ్రాసియిస్తేమాత్రం చేసుకోవాలని వుందేమిటి?

సుకు—నాకు తెలుసు. మతివున్నవాళ్లూ అనేది ఒకటి, చేసే దొకటి. మతిలేనివాళ్లకే మాటనిలకడ వుంటుంది. (విశాల నవ్వుతుంది)

శేఖ—ఒక్కనిమిషం ఒక్కనిముషం అలాగే నుంచోండి.

సుకు—ఎందుకూ?

శేఖ—ఒక్కఫొటో, ఆఖరిఫొటో

[ఫొటోతీస్తుండగా]